Vēṅkaṭasōmayājulu, Mallādi

Guṇṭūru caritra

Guṇṭūru, 1923

Record no. 765

వేంకటసోమయాజులు, మల్లాది.
గుంటూరు చరిత్ర / మల్లాది వేంకట సోమయాజులుగారిచే వ్రాయబడినది. - గుంటూరు : తిక్కన విద్యానిలయము, 1923
66 p. ;18 cm.
Record no. 765

Vēṅkaṭasōmayājulu, Mallādi.
Guṇṭūru caritra / Mallādi Vēṅkaṭa Sōmayājulugāricē Vrāyabaḍinadi. - Guṇṭūru : Tikkana Vidyānilayamu, 1923.
66 p. ;18 cm.
Record no. 765



# తిక్కనవిద్యానిలయము, గుంటూరు.

కవిబ్రహ్మనాఁబడు తిక్కన సోమయాజి స్మరణచిహ్నముగ ఈవిద్యానిలయము, సాధారణనామ సంవత్సర మాఘమాసమున ( 1911 **February** ) నెలకొల్పఁబడి, రిజిష్టరు చేయింపఁబడినది. నిలయసభ్యుల ప్రస్తుతసంఖ్య 88. గ్రంథాలయమును, పఠనమందిరమును గలవు. నిలయమును బగలంతయుఁ దెఱచియుంచి సర్వజనుల నుచితముగఁ జదువనిత్తుము. గ్రంథాలయమున 60 సంస్కృతగ్రంథములును, 954 ఆంధ్రగ్రంథములును, 732 ఆంగ్లేయగ్రంథములును గలవు. భాషాభిమానుల ద్రవ్యసహాయమున స్వభవనము నిర్మింపఁబడినది. నిలయగృహప్రవేశోత్సవము ( దుందుభి సం॥ ఫాల్గున శు. ౧౦ ఆదివారము 25-2-23. ) ఆంధ్రమహాశయులెల్లరు ఈగ్రంథాలయమునకు సహాయముఁ జేయ బ్రార్థితులు.

# గుంటూరు చరిత్ర

గుంటూరు టౌన్ హైస్కూలునందలి

ఉపాధ్యాయులగు

## మల్లాది వేంకటసోమయాజులు

గారిచే వ్రాయఁబడి

గుంటూరునందలి

శ్రీ తిక్కన విద్యానిలయమువారిచేఁ

బ్రచురితము.

చంద్రికా ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడెను.

# పీఠిక.

పురచరిత్రలు వ్రాయఁబూనుట చాలఁ బ్రశంసనీయమైన విషయము. ఇట్లు ప్రతిస్థలచరిత్రయుఁ బూసగ్రుచ్చినరీతి వ్రాసిన దేశభాగములచరిత్రలు బాగుగ నర్థమగును. కాలచక్రము మారినకొలఁది స్థలములప్రాముఖ్యమెవ్విధముగ మారునదియు గ్రాహ్యమగును. ఒక స్థలము ఒక కాలమందు మిక్కిలి యౌన్నత్యస్థితిఁ జెంది తరువాత క్షీణించుటయు, మఱియొకస్థలము చాలకాల మనాదరణముగనుండి కొలఁది వత్సరములలో నెక్కుడు నాగరికతతోను, విద్యలోను, వాణిజ్యముతోను శోభిల్లుచుండుటను జూచుచున్నాము. ఇట్టి మార్పులకు నైసర్గికస్వరూపములు, సాంఘికస్థితులు, ఆర్థికస్థితులు మొదలయినవి యెంతవఱకుఁ గారణభూతము లనువిషయములు నవీనకాలమందుఁ జర్చింపఁబడుచున్నవి. ఈ పొత్తమందుఁ జరిత్రాంశములు మాత్రము బాగుగ విమర్శింపఁబడినవి.

ఈ గుంటూరు చరిత్రము బ్రహ్మశ్రీ కల్లాది వేంకటసోమయాజులు గారిచేఁ బ్రశంసనీయమైన చరిత్రలు వ్రాయు పద్ధతిననుసరించి వ్రాయఁబడినది. ఇందు గుంటూరు నామధేయము మొదలయిన కఠినవిషయములు బహుసహేతుకముగా దృష్టాంతపరంపరలతో విమర్శింపఁబడినట్లు కనఁబడుచున్నది. ఉభయకవిమిత్రుఁడను బిరుదమును వహించిన తిక్కనసోమయాజికిని, ఈ గ్రామంబునకును యెక్కువసంబంధమున్నదని నిర్ణయించి, ఈపురమును ఆంధ్రచోళులు, రెడ్డిప్రభువులు, జమీందారులు ఎవ్విధముగ వారి వారి కాలములయందు ఎన్నికలో నుంచినదియు విపులముగ వ్రాయఁబడియున్నది. నవీనకాలమువఱకుఁ బురము ఎవ్విధముగఁ బెరిగి మార్పులు చెందినదియుఁ జక్కఁగ విమర్శింపఁబడినది. ఇట్లు ఎక్కువ పాండిత్యముతోను, విమర్శనాశక్తియుక్తులతోను వ్రాయఁబడిన పురచరిత్రను బురజను లభిమానముతోఁ బఠింతురని నానమ్మిక.

టౌన్ హైస్కూల్
గుంటూరు.
28–4–28.

బుద్ధిరాజు రామచంద్రరావు,
ఎమ్. ఏ. ఎల్. టి.
ప్రధానోపాధ్యాయుఁడు.

# అవతారిక

ఆంధ్రకవిత్రయములో నెన్నికగన్న తిక్కనసోమయాజి తండ్రితాతలు గుంటూరి విభులుగాఁ బ్రసిద్ధిచెంది యుండినకాలమున నివ్విద్వత్కవీంద్రుఁడు తనప్రథమదశయం దిచ్చటనేయుండి నల్లశాణాంబయను నిష్టదేవత నుపాసించుచుఁ గొంతకాలము వసించిన వాఁడగుటచేఁ దద్జ్ఞాపకార్థ మేతత్పురజను లీపురమునకు మూలాంకురమైన పాతగుంటూరులో నీమహామహుని పేరఁ 'దిక్కన విద్యాలయ' మను నామముతోఁ బ్రశస్తమైన యాంధ్ర గీర్వాణాంగ్లేయభాషాగ్రంథములను గూర్చి గ్రంథాలయ మొకటి సాధారణనామ సంవత్సర మాఘమాసమందు (క్రీ॥ శ 1911 సం॥) నొకగృహములోఁ దాత్కాలికముగా నెలకొల్పి దానికి స్వకీయమైనశాలను గ్రొత్తగానిర్మించి యీ సంవత్సరమున ఫాల్గున శుద్ధనవమీ భానువాసరమునాఁడు నూత్నశాలాప్రవేశకాలమందు అవధానిశిరోమణి... శ్రీ కాశీకృష్ణాచార్యులుగారి యాజమాన్యముక్రింద జరిగిన మహాసభలోఁ జదువుటకై గుంటూరుచరిత్రనుగూర్చి యొక వ్యాసము వ్రాయుమని తద్విద్యాలయ నిర్వాహకులలో నొక్కరైన శ్రీయుత మాంచిరాజు వెంకటకృష్ణమూర్తిగారు నన్నుఁ బ్రేరేపించుటచేత నీవ్యాసమును వ్రాసితిని. అదియే యిపు డచ్చొత్తింపఁబడినది. ప్రసక్తిననుసరించి యీచరిత్రమునం దాంధ్రసారస్వతప్రధాన విషయములును రాజ్యపాలనసంబంధమునఁ దెలుపఁబడినవి. ఇందలి పండ్రెండు ప్రకరణములలో నొకటి తిక్కననుగూర్చినది. తక్కినవి గుంటూరిపాలనాదికములను దెలుపును. ఆంధ్రజనులందఱు దీనినాదరింప వేఁడుకొనుచున్నాఁడను. ఇట్లు,

గుంటూరు. }
15-4-23 }

విబుధారాధనవిరాజి
మల్లాది వెంకటసోమయాజి.

హరిః ఓమ్ తత్సత్.

# గుంటూరు పుర చరిత్రము.

సీ॥ శ్రీతిక్కయజ్వ దాఁ జిన్ననాఁడెచ్చోట విద్వత్కవీంద్రుఁడై వెలసినాఁడు
తత్కవీంద్రసుతుండు, తాతతండ్రియు నెందు విభుపదంబున నిల్చి వెలసినారు
సోమనామాత్యాది శుద్ధాత్ములేయూర గుళ్లుగోపురములు గూర్చినారు
నారాయణోదయవరపతులెవ్వీట నెదురులేక ధరిత్రి నేలినారు
గీ॥ అట్టిగుంటూర నల్లశాణాంబకృపను నాంధ్రగీర్వాణసాహిత్యమందఁగ నివ
నుభయకవిమిత్రుఁ డెదిగొల్చె నూర్జితమని యట్టిహరిహరతత్త్వంబు నాశ్రయింతు.

## ప్రథమ ప్రకరణము.

### * గుంటూరు నామోత్పత్తి *

గుంటూరను పేరు పూర్వము పాతగుంటూరికే చెందియుండెను. అటుతరువాతఁ గ్రొత్తగా నేర్పడిన పేటలన్నియుఁ జేరి క్రొత్త గుంటూరను పేరు వహించినపుడు మొదటి గుంటూరే పాతగుంటూరైనది.

గుంటూరను పేరుకలుగుట కనేకు లనేక కారణములు చెప్పుచున్నారు. అందయిదు కారణములు ముఖ్యములైనవి.

1 పాతగుంటూరికిఁ బడమటనున్న యొఱ్ఱచెఱువు పూర్వము పెద్దగుంటగా నుండుటచేతనో దానియం దనేకములైన

గుంటలుండుటచేతనో యీయూరికి గుంటూరను నామము కలిగిన దని కొందఱూహించుచున్నారు. ఇప్పటివారు కొందఱు దానికి 'గర్తపురి'యను సంస్కృత నామమును బద్యాదులయందును వాడుచున్నారు.

2 'గర్త'మనఁగా గుంటప్రమాణము. 'కుంట'యను ప్రమాణమిప్పటికి, యకరములో మూఁడవ వంతగుచున్నది. కుంటప్రమాణముగల యూరై యందునఁ గుంటూరను పేరు కలిగెనని మఱికొందఱనుచున్నారు.

3 ఈయూరు రాజస్థానముగానుండిన పూర్వకాలములో గ్రామజనులందఱికిని 'వేళదెలియుటకై మధ్యాహ్నము రెండుజాముల వేళ నొకఫిరంగిగుండు వేయఁబడుచుండుటచే 'గుండూరు'ను పేరీగ్రామమునకుఁ గలిగినదనియు, గుండూరే యటుతఱువాత గుంటూరని వ్యవహరింపఁబడెననియుఁ గొందఱు చెప్పుచున్నారు. ఆంధ్రభాషాభిమానియై సుప్రసిద్ధుఁడైన సి. పి. బ్రౌన్ దొరగారు గుంటూరికిఁ బూర్వపుపేరు గుండూరని చెప్పెడియొక ప్రాతలేఖను జెన్నపురియందలి ప్రాచ్యలిఖిత పుస్తకనిలయమం దుంచియున్నారు.

4 గుంటివిఘ్నేశ్వరుఁ డను నొక శిలావిగ్రహ మొకటి యిచ్చటి యెఱ్ఱచెఱువునొద్ద నుండుటచే నీయూరికి గుంటూరను పేరువచ్చినదని యింకఁ గొందఱనుచున్నారు.



5 ఈమండలములోఁ బ్రధానస్థలమైన కొండవీడు మెట్ట నుండుటచే, గుంటప్రదేశములోనున్న యీప్రధాన స్థలమునకు గుంటూరను పేరువచ్చినదని కొందఱనుచున్నారు.

6 ఈపైనఁ దెల్పఁబడిన యైదుముఖ్య కారణములు కాక నేను మఱియొక కారణ మూహించుచున్నాను. అది యెద్ది యనఁగా- అభినవదండి బిరుదాంకితుఁడును మూలఘటికాన్వయుఁడునైన కేతనకవి దశకుమార చరిత్రమనెడి యాంధ్రపద్య కావ్యమును రచియించి, యాంధ్రసారస్వత మహారాజ్యసార్వభౌముఁడైన గుంటూరి తిక్కన సోమయాజికి దానిని గృతియొసంగి, తిక్కనయింటిపేరు 'కొట్టరువు' వారని యాగ్రంథమందుఁ దెలిపియున్నాఁడు. 'కొట్టరు' 'కొట్టరువు'నని రెండురూపముల నితఁడువాడియున్నాఁడు. తిక్కనకు సమకాలికుఁడైన యీ కవిచెప్పిన (యీయింటిపేరు) ప్రత్యక్షసాక్ష్యముగాఁ జెప్పఁబడిన దగుటచేతను, గృతిపతిని స్తుతించుటకై యతిశయోక్తిగాఁ జెప్పఁబడినదనుట కవకాశము లేనిదగుటచేతను, నిది విశ్వాసపాత్రమనక తప్పదు. కాఁబట్టితిక్కన యింటిపేరు పూర్వం 'కొట్టరు'వారనుట స్పష్టము.

తిక్కనవంశమువారికి గుంటూరినుండి వెళ్ళినవారగుటచే గుంటూరివారను పేరు తిక్కనవఱకును వాడుకలోనుండి నట్లును, తిక్కనకొమారుఁడైన 'కొమ్మన' పాటూరికరణికము సంపాదించి యచ్చటనుండుటచే నతనికాలమునుండి యీవంశపు

వారు పాటూరివారైనట్లును గొందఱు చరిత్రకారులు వ్రాసి యున్నారు.

తిక్కన యింటిపేరు కేతనచెప్పినట్లు 'కొట్టరు'వారా? కొందఱు చరిత్రకారులు చెప్పునట్లు గుంటూరివారా? యను సందేహము కలుగవచ్చును. దీని నెట్లు నివారింపవచ్చును; 'కొట్టరు'శబ్దము కాలక్రమమున 'గుంటూరు'గా మాఱియుండునని నాకుఁ దోఁచుచున్నది. 'కోలాచలమల' 'కొలచలముల' కొలిచినమల, 'కొలిచిన'యని క్రమముగా మాఱిపోయినందున జనులు సాధారణముగా 'కోలాచలమల'వారిని 'కొలిచిన' వారను చున్నారు గాని [illegible]ములలోఁ దెలిసినవారు కొందఱును, వారిని జక్కఁగా నెఱిఁగినవారు కొందఱును, మాత్రమిప్పటికిని వారి యింటిపేరు 'కొలచలమల' వారేయని చెప్పు చున్నారు. అట్లే తిక[illegible] యింటిపేరు జనులు సాధారణముగా గుంటూరివారనితఱువాత వ్యవహరించుచుండినను, వారియింటిపేరు కేతనచక్కఁగా గుర్తెఱిఁగినవాఁడగుటచే నతఁడు మాత్రము మొదటిపేరగు గుంటూరని మార్పక 'కొట్టరు' వారని పూర్వనామమే వాడియుండును. కొట్టరుశబ్దము గుంటూరని మాఱుట యొకవింత కాదు.

పూర్వశాసనాదులయందు విజయవాడ యనుపేరు బెజవాడ యనియు, 'హేలాపురమే' 'యేలూరనియు' 'కందనోలు' కర్నూలనియు, 'కొట్టియదోన' 'కొనిదెన'యనియు 'మాచెలచె



ఱువుల' 'మాచెర్ల' యనియు, నిట్లుపూర్వనామము లెన్నియో కాలక్రమమున మాఱుచుండుటమనము చూచుచున్నాముగదా.

కొన్ని పూర్వశాసనములయందు గుంటూరికి గొంటూరని వ్రాయఁబడియున్నది. ఇదియును నాయూహకు మిక్కిలి సహకారి. కాఁబట్టి 'కొట్టరు' శబ్దమే మొదట 'గొంటూరు' గామాఱి తఱువాత గుంటూరుగా నేర్పడియుండును. తిక్కన యింటిపేరు 'కొట్టరు'వారని దశకుమారచరిత్రలోఁ జెప్పుట 'గుంటూరి'వారని చెప్పుటయే కాని వేఱు కా[illegible]మోయనియు, 'కొట్టరు' శబ్దమునుండి గుంటూరను పేరుకలిగియుం[illegible] నాతాత్పర్యము. ఈ యింటిపేరును గూర్చితిక్కన చరి[illegible]కరణమందింకను వ్రాయఁబడును. కాఁబట్టి కొట్టరువే గుం[illegible]వచ్చును.

## ద్వితీయ ప్రకరణము.

—* గుంటూరి ప్రాచీనత-ప్రాముఖ్యత. *—

గుంటూరు పురాతన మనుటకుఁ గొన్ని హేతువులు గలవు. ఈగ్రామములోనే యెత్తుచెఱువు ప్రక్కనున్న యగస్త్యేశ్వరాలయమనెడి శివాలయములో శా॥ శ॥ ౧౦౮౦వ సం॥ (అనఁగా, క్రీ॥శ॥ ౧౧౫౮ సం॥) పాండ్యరాజు శాసనమొకటి *

* స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౦౮౦ అగునేటి ఉత్తరాయణ సంక్రాంతినిమిత్తమున శ్రీమన్మహా మండలేశ్వర పాండ్యరాజు ఒంగేరు మాన్యము లోని గుంటూరి శ్రీ యగస్త్యేశ్వర మహాదేవరకు గుడియును మండపమును

కలదు. ఇతఁడు (ఇప్పటి కొలిపాక) కొల్లిపాకయను గ్రామము రాజధానిగాఁగల యొకచిన్న సంస్థానమునకు ప్రభువు. ఇతఁడు 'బంగేరు'మన్యములోని శ్రీగుంటూరి యగస్త్యేశ్వర స్వామికిగుడియును బరివారపు గుళ్లునుగోపురములును నిర్మించి ప్రాకారము గట్టించినట్లును, స్వామిపరివారము గానున్నవారికి గడ్డిపూఁడి చుట్టునున్న పొలమిచ్చినట్లును, ఆ శాసనమునన్నది. అదివఱకే యగస్త్యేశ్వరస్వామియిచ్చట నుండుటచేతను, గ్రామనామము గుంటూరని వ్రాసియుండుటచేతను, రాజ్యముఁ బాలించు మహామాండలికుఁడగు రాజిక్కడికి వచ్చి ధర్మకార్యములిచట చేయుటచేతను, గుంటూ రప్పటికే ప్రాచీనమైన ప్రసిద్ధ ప్రదేశముగా నుండియుండ[illegible]తోఁచుచున్నది. గడ్డిపూఁడియనునది పూర్వము [illegible]దిగ్భాగమున క్రోసెఁడుదూరమున నున్న యొకయూరి[illegible]యిప్పుడు లేదుగాని దానిచెంతను గడ్డిపాటివంతెనయను పేరుగల యొక వంతెనకలదు. అక్కడిపూర్వ గ్రామసూచ[illegible]ప్పటికినిగలవు. ఆగ్రామమునీరాజు దేవునికిచ్చుటచే గుంటూ రారాజుపాలించియుండుననితోఁచుచున్నది.

---

బరివారపు గుళ్లును బ్రాకారమును గోపురసహితమైన గుళ్లెత్తించి యాదేవరకు హవిబలియర్చనలకు మానులకు సానులకు పట్టమునికి మద్దెలకాఱకు మొకరికి వాశికులకు శిల్పికాచార్యునికి శంకులవారిని బెరసిన దేవర పరిమాటమువారికి గడ్డిపూఁడి వలయచుట్టు పొలము చతుస్సీమము (మధ్య) ఆచంద్రార్కస్థాయిగా నిచ్చితిమి"—

గుంటూరి యగస్త్యేశ్వరాలయమందలి పాండ్యరాజశాసనము.



తిక్కన సోమయాజి నిర్వచనోత్తరరామాయణమును ౧౨౫౦ వ సం॥ ప్రాంతమున రచియించినట్లు చరిత్రకారులు తెలిపియున్నారు గనుక, ఈగుంటూరి శాసనమప్పటికి నూఱు సంవత్సరముల పూర్వపుదిగా నున్నది. గుంటూరి విభులును, తిక్కన సోమయాజికిఁ బితృపితామహులునైన కొమ్మన భాస్కరులీ శాసన కాలమునకుఁ దఱువాతనే గుంటూరి విభుత్వమందుండి యుందురు. కాఁబట్టి యీశాసనము తిక్కన సోమయాజి యొక్క ప్రపితామహుని కాలములోనిదై యుండును.

బెజవాడ కొండమీఁది మల్లీశ్వరస్వామివారి యాలయమునకు సరిగా దిగువనున్న శిథిలమంటప [illegible]ములయందు గుంటూరి పేరుగల శాసనములు మూఁడుకలవు. అందు మొదటి శాసనము * శా॥ శ॥ ౧౦౬౯ సం॥ (అనగా, క్రీ॥ శ॥ 1147 సం॥) భీమనయను నొక ప్రభువునొద్ద సంధివిగ్రహాధికారియైన సోమనామాత్యుఁడు వేయించినది. దత్తనామాత్య పుత్రుఁడయిన యీమంత్రీంద్రుఁడు గుంటూరియందు గుళ్ళు కట్టించి చెఱువులు తవ్వించినట్లుందున్నది. ఈ శాసనము, గుంటూరి

---

* "(పాటికెక్కిన బెజవాడ మల్లేశ్వరదేవరకు నఖండదీపరకులు) పెట్టి గుంటూరఁ జెర్వులు పెక్కుగుడులునిలిపి సప్తసంతతుల సంఖ్యలుగఁజేసె దత్తనామాత్యసోముండు ధర్మపరుడు దారభానుఁడా చంద్రతారకముగ".

సోమన శాసనములోని పద్యము. (శా॥ శ॥ ౧౦౬౯)

శాసనముకంటె బహునొకండు సంవత్సరముల పూర్వపుదై గుంటూరప్పటికిఁ బ్రసిద్ధమైనదని సూచించుచున్నది.

ఆమంటపమందే మఱియొక శాసనము శా॥ శ॥ ౧౧౩౮ సం॥(అనఁగా, క్రీ॥ శ॥ 1216 సం॥) 'ఉదయ'రాజనెడి గుంటూరి ప్రభువునొద్ద సేనానిగానున్న సూచనమంత్రి వేయించిన శాసనము. అప్పుడుదయ రాజునకు మంత్రి బొల్లనయని యందుఁదెలుపఁబడి యున్నది. ఇదితిక్కన జన్మకాల ప్రాంతమందలిది.

ఆమంటపమందే గుంటూరిని గూర్చిన యింకొక శాసనము శా॥శ॥1177 (అనగా క్రీ॥ శ॥ 1255 సం॥) నారాయణదేవుఁడనెడి గుంటూరి ప్రభువునొద్దసేనానిగానుండిన రాయనమంత్రి వేయించినది. ఈశాసనకాలము తిక్కనసోమయాజినెల్లూరియందుమనుమరాజునొద్దనాస్థానకవిగానుండి యాప్రభువు నకుఁ దన నిర్వచనోత్తర రామాయణముకృతి యిచ్చినకాలమునాఁటిది. సూచన, రాయనల శాసనములవలన గుంటూరప్పుడు రాజాస్థానమైన ప్రసిద్ధపట్టణమని తెలియ వచ్చుటయే కాక, తిక్కన జననకాల ప్రాంతమందును నాతనిజీవిత కాలమందును నాతనివంశపువారు గాక యితరవంశపునారే గుంటూరికిఁ బ్రభువులుగా నుండినట్లు స్పష్టముగాఁ గానఁబడుచున్నది.

బెజవాడ మల్లీశ్వరస్వామి శిథిలమంటపమందున్నవని యిదివఱకుఁ జెప్పఁబడిన మూఁడుశాసనములు కాక యామంటపమందే బొద్దన కొడుకైన నారాయణదేవుని శాసనము * శా॥ శ॥ ౧౦౩౩ వ సం॥ (అనఁగా, క్రీ॥ శ॥ ౧౧౧౧ సం॥) గలది యొకటియు, మఱియొక బొద్దనరాజున కథ్యక్షుఁడైన నాగయదేవుని శాసనము శా॥ శ॥ ౧౦౫౪ సం॥ (అనఁగా క్రీ॥ శ॥ ౧౧౩౨ సం॥) గలది మఱియొకటియుఁ గానంబడుచున్నవి. ఈ రెండు శాసనములలోని బిరుదావళులును, పైమూఁడు శాసనములలోని సోమనమంత్రి శాసనమునం దతని యజమానిగాఁ జెప్పఁబడిన భీమనప్రభు బిరుదావళులును నేకవిధముగాను నేకక్రమముగాను దెలుపఁబడి యున్నవి. ఇట్లు బిరుదసామ్యమును నామసామ్యమునుగల యీ మూఁడు శాసనములలోని రాజులు నేకవంశపువారై యుందురు కాని వీరలెచ్చటివారో తెలుపఁబడి యుండలేదు. ఈ మూఁడిటిలోనిదైన సోమనమంత్రి శాసనములో నతఁడు గుంటూరిలో దేవాలయాది ప్రతిష్ఠలు చేసినట్లు చెప్పఁబడినది కాని తక్కిన రెండు శాసనములలోని ప్రభువులకు గుంటూరితో నెట్టిసంబంధమైన కలదో లేదో తెలుపఁబడి యుండలేదు.

---

* "పాత్రులసత్కవీంద్రుల విపశ్చిదనీకముఁ బ్రోచి మించి యీ
ధాత్రికి నెంతయేనియు ముదంబొనరించిన యీపరాంగనా
పుత్రుఁడు దన్మురారి బలిఁబోలి మహీతలమేలుగావుతన్
ధాత్రియు నబ్జమిత్రుఁడు సుధాకరుఁడుంగల యంతకాలమున్".

శ్రీ మన్మహామండలేశ్వరుఁడైన బొద్దనకొడుకు నారాయణదేవునిశాసనమందలి పద్యము (శా॥ శ॥ ౧౦౩౩). ఇది నన్నయభట్టు కాలమునాఁటిది.

తిక్కన తాతయైన మంత్రి భాస్కరుఁడును, ఆతని తండ్రియైన కొమ్మనామాత్యుఁడును గుంటూరి విభులు*గానుండి రని తిక్కన కవి తన గ్రంథములయందు వ్రాసికొనియున్నాఁడు. వీరి విభుత్వమెప్పుడో విమర్శింప వలసియున్నది. వీరివిభుత్వము నిజముగా రాజ్యపరిపాలనమే యయినచోఁ, పైశాసనములనుబట్టి క్రీ॥ శ॥ 1216 సం॥ పూర్వమును 1158 సం॥ తఱువాతను జరిగి యుండవలెను. ఎట్లనఁగా-తిక్కన ముప్పది నలువది సంవత్సరముల ప్రాయమువాఁడై యుండఁగా నిర్వచనోత్తర రామాయణమును క్రీ॥ శ॥ 1257-58 సం॥ ప్రాంతమందు రచియించినట్లు చరిత్రకారులు నిశ్చయించి యున్నారుగనుక, క్రీ॥ శ॥ 1216 సం॥ ఉదయరాజు గుంటూరి ప్రభువుగానుండినట్లు తెలిపెడి బెజవాడ శాసనకాలము, తిక్కనకవి జననకాలప్రాంతపుదిగా నిశ్చయింప వచ్చును; కాఁబట్టి యతని తండ్రితాతలవిభుత్వ మాశాసనకాలమునకుఁ దఱువాత జరిగి యుండదు. అప్పటికిఁబూర్వమే జరిగి యుండవలెనని చెప్పవలెను. ఈవిభుత్వశబ్దమునకుఁ గరిణీకమను నర్థముచేసినచో నీశాసనకాలమునకుఁ దఱువాత జరిగినవన్నను బాధ లేదు. దీనింగూర్చి మఱియొకచో విమర్శన చేయఁబడును.

---

* "సారకవితాభిరాముగుంటూరివిభుని మంత్రిభాస్కరు మత్పితామహునిఁ దలఁచి"— నిర్వచనోత్తరరామాయణము.

"కూరిమితమ్ముండు గుంటూరివిభుఁడు కొమ్మనదండనాథుఁడు ..."

— ఆంధ్రభారతవిరాటపర్వము.



# తృతీయ ప్రకరణము.

## —• గుంటూరి ప్రాచీనపరిపాలనము. •—

గుంటూరు ప్రాచీనమై ప్రాముఖ్యమైయుండిన యొక రాజాస్థానమని యిదివఱకే తెలుపఁబడినది. ఇదియెప్పటినుండి యట్టియాస్థానముగానుండెనో తెలుపు సాధనసామగ్రిలింకను మఱుగు వడియున్నవి. పూర్వప్రకరణమందుఁ జెప్పఁబడిన విషయములను బట్టి యిదిపూర్వకాలమందుఁ గూడ సుప్రసిద్ధనగరములలోఁ బరిగణింపఁబడియుండు ననియూహింపఁదగియున్నది.

## ఆంధ్రుల పరిపాలనము

[ క్రీ॥ పూ॥ 73 సం॥ ప్రారంభమై 456 సం॥ లవఱకు.]

ఆంధ్రరాష్ట్రములోనిదైన గుంటూరిప్రాంతమును బూర్వమాంధ్రజాతీయులేలిన సంగతి నిస్సందేహము. ఆంధ్రులు పురాణప్రసిద్ధులు. ఋగ్వేదసంబంధమైన యైతిరేయబ్రాహ్మణమందు వీరు విశ్వామిత్రసంతతివారని చెప్పఁబడినది. మనుస్మృతి మొదలగు ధర్మశాస్త్రములయందును భారతాది గ్రంథములయందును భాగవతాది పురాణములయందును వీరలనుగూర్చి వ్రాయఁబడినది. ఆంధ్రులేలిన దేశమే యాంధ్రదేశము. పురాణగాథలనుబట్టి చూడఁగా, సుచంద్రునిపుత్రుఁడైన యాంధ్రవిష్ణువనువాఁడు నిశంభుఁడను రాక్షసుని జయించి శ్రీశైలము కాళేశ్వరము భీమేశ్వరమున నెడి త్రిలింగక్షేత్రములయందు దుర్గ

ముల నిర్మించినట్లును ద్రిలింగక్షేత్రములచేతనే యీయాంధ్ర దేశమునకుఁ ద్రిలింగదేశమను నామము కలిగినట్లును బురాణ ప్రసిద్ధము. ఇట్లే యథర్వణాచార్యులును దెల్పియున్నాఁడు. త్రిలింగదేశమేమాటి తెలుఁగుదేశమైనది. ఆంధ్రదేశము పూర్వ మొకప్పుడు ప్రబలరాజ్యమని విదేశీయులుకూడఁ బొగడియున్నారు. మగధదేశమునందు మౌర్యవంశరాజైన చంద్రగుప్తుని యాస్థానమందు రాయబారిగా నుండిన ‘మెగాస్తిసీస్’ అనెడి యవనదేశస్థుఁ డాంధ్రరాజ్యము ప్రశస్తమైనరాష్ట్రమని నుడివి యున్నాఁడు. హుయ్యాయన్త్స్యాంగ నెడి చీనాదేశ యాత్రికుఁడు నాంధ్రదేశము బలిష్ఠమైన రాజ్యముగాఁ జెప్పియున్నాఁడు.

ఆంధ్రులు మొట్టమొదటఁ గృష్ణామండలములోఁ గృష్ణా తీరమందుండిన శ్రీకాకుళమును గొంతకాలమువఱకును, గుంటూరుమండలములోఁ గృష్ణానదికి దక్షిణముననున్న యమరావతి పట్టణముతో సంబంధించిన ధాన్యవాటిని (అనఁగా, నిప్పటి ధరణికోటను) గొంతకాలమును, రాజధానిగాఁ జేసికొని 456 సంవత్సరము లాంధ్రరాజ్యమును నిరంకుశముగాఁ బాలించి వింధ్యోత్తరదిశనున్న మగధరాజ్యమునకుఁగూడఁ దామే ప్రభువులైరి. ఆంధ్రులశాసనములును వారినాణెములును గొన్ని యిప్పుడు గుంటూరుమండలమందును దొఱికినవి. గుంటూరు మండలమొకప్పుడాంధ్రులకు లోఁబడియుండెననుట స్పష్టము.



## —♦ పల్లవుల పాలనము •—

[ఆంధ్ర రాజ్యానంతరము క్రీ॥ శ॥ నాలుగవశతాబ్దము మొదలు క్రీ॥ శ॥ 615 సంవత్సరము వఱకు].

పల్లవరాజు లాంధ్రులకుఁ దఱువాత నాంధ్రదేశము నేలిరి. వీర లనేకతెగలుగలవారై వేఱువేఱుచోట్ల రాజ్యము చేసిరి. అందొక తెగవారు గోదావరిమండలములోని యేలూరికి సమీపమందున్న వెంగి (వేఁగి) యను గ్రామము రాజధానిగాఁ జేసికొని పాలించిరి. అశ్వత్థామ వంశజులమనియు, భారద్వాజ గోత్రులమనియు శాసనాదులయందుఁ బల్లవులు చెప్పుకొనుచున్నారు. త్రిలోచనపల్లవుఁడనువాఁడు వీరిలో సుప్రసిద్ధుఁడు. వీరాంధ్రులలో నొక తెగవారుగఁ గానంబడుచున్నారు. కాని పురాణాదులయందుఁ జెప్పఁబడిన పహ్లవులు వీరేయని చెప్పుట కవకాశము గానంబడదు. పహ్లవులు విదేశీయులని చరిత్రకారులు చెప్పుచున్నారు. పల్లవులు స్వదేశీయులై మొట్టమొదట శైవులుగానుండి యనంతరమున జైనబౌద్ధమతముల నవలంబించి రాజ్యముచేసినట్లు కానఁబడుచున్నది. వీరిరాజ్యమును చాళుక్యులు జయించుటచే వీరు చెల్లచెదరై యాంధ్రరాజ్యము విడిచి పలుదిక్కులకు వెళ్లిరి. అందొక శాఖవారు దక్షిణదేశమునఁ జాళుక్యరాజ్యానంతరమునఁగూడ రాజ్యముచేసినట్లు కానంబడుచున్నది. ఒక పల్లవరాజును మనుమరాజు పూర్వుఁడైన కలికాలరాజు జయించినట్లు నిర్వచనోత్తరరామాయణమునఁ

దిక్కనసోమయాజి చెప్పియున్నాఁడు. వీరి శాసనములు ప్రాకృత భాషలోఁ గానంబడుచున్నవి. అవి యాంధ్రద్రావిడ దేశముల యందుఁ దఱుచుగా దొఱకుచున్నవి. గుంటూరుమండలము పూర్వము పల్లవరాజ్యములో నొకభాగముగానుండి పల్లవులచేఁ గొంతకాలము పాలింపఁబడియుండెను.

### చాళుక్యుల పాలనము.

[క్రీ॥ శ॥ 615 సం॥ మొదలు 1063 సం॥ వఱకు]

చాళుక్యరాజులు పల్లవులను జయించి యాంధ్రరాజ్య మేలిరి. వీరి పరిపాలనము మొదలుకొనియే యాంధ్రదేశచరిత్ర కొంతవఱకైనను దెలియవచ్చుచున్నది. ఆంధ్రభాషాభివృద్ధియు నాంధ్రగ్రంథములును వీరి కాలమందే బయలు వెడలినవి. అప్పటి తెలుఁగులిపియుఁ గన్నడలిపియు నేకరీతిగానుండెను. పూర్వపు దెలుఁగక్షరములు దేవనాగరమునుండి పుట్టి క్రమక్రమముగా మాఱిపోయినవి. పూర్వపు దెలుఁగులిపియుఁ గ్రమక్రమముగా మాఱి యిప్పటిస్థితికివచ్చినది. ఆంధ్రదేశపుఁ బూర్వశాసనములు గొన్ని సంస్కృతభాషయందును మఱికొన్ని ప్రాకృతభాష యందును మాత్రమే బహుకాలమువఱకుఁ గానఁబడుచుండెను. గాని చాళుక్యుల కాలమందుఁ దెలుఁగక్షరపుశాసనములు బయలు పడినవి. అటు తఱువాతఁ దెలుఁగుపద్యములుగూడ శాసనముల యందు నచ్చటచ్చట వ్రాయఁబడియున్నవి. గ్రంథములు మాత్రము శ్రీనన్నయభట్టారకుని కాలమువఱకును బయలుపడ



లేదు గాని యంతకుఁ బూర్వమునఁ గూడ యాంధ్రగ్రంథములు లేకపోలేదని శాసనములలోని తెలుఁగు పద్యములవలనను, ఇంక నితర కారణములవలనను దెలియవచ్చుచున్నది.

చాళుక్యులెచ్చటి నుండివచ్చినవారు? ఎచ్చట రాజ్యము చేసిరి? వీరి రాజధానియెద్ది? వీ రేమికార్యములుచేసిరి? అను మొదలైన విషయములను గూర్చి విమర్శింపవలసియున్నది.

చాళుక్యులు చంద్రవంశపువారమనియుఁ బాండవుల వంశపువారమనియు నుత్తరదేశమునుండి వచ్చితిమనియు శాసనాదులయందుఁ జెప్పుకొనుచున్నారు. వీరు దక్షిణదేశస్థులని కొందఱు చరిత్రకారులనుచున్నారు. వీరిలో విజయాదిత్యుఁడను రాజయోధ్యాదేశమునుండి బయలు వెడలి దక్షిణ దిగ్విజయ యాత్రకైవచ్చి త్రిలోచన పల్లవునితో యుద్ధముచేసి మృతి నొందఁగా గర్భిణిగానున్న యాతని భార్య (కడప జిల్లాలోని,) ముదివేము నెడి యగ్రహారములో విష్ణుభట్ట సోమయాజి యనెడి బ్రాహ్మణునిచే నాదరింపఁబడినట్లును, ఆమెకుఁ బుట్టిన పుత్త్రుఁడే విష్ణుభట్టసోమయాజిచేఁ బెంపఁబడినవాఁడగుటవలనవిష్ణువర్ధనుఁడను పేరువహించి యాంధ్రరాజ్యమును సంపాదించి వెంగిదేశము రాజధానిగా రాజ్యమేలినట్లును, గొన్ని శాసనములయందున్నది.

వెంగిదేశమనునది కృష్ణాగోదావరీమధ్యస్థమైన తెలుఁగు దేశము. దీని మొదటిరాజధాని వెంగి యనునది. ఇది యేలూరు పట్టణమునకు నుత్తరమున సమీపమునందున్నది. ఈ రాజ్యము

క్రమక్రమముగా నుత్తరమునను, దక్షిణమునను వ్యాపించుటచే రాజధానిని మధ్యస్థముగా నుంచుకొనుటకై చాళుక్యులు వెంగిపట్టణమునుండి తమ రాజధానిని రాజమహేంద్రవరమునకు మార్చిరి. ఈ చాళుక్యరాజులాంధ్రదేశమున నొకరితఱువాత నొకరు క్రీ॥శ॥ 615 మొదలుకొని 1063 సం॥ వఱకును 27 గురు తెలుఁగుదేశమున రాజ్యముచేసిరి. ఇందుఁ బదునాఱవ రాజైన యమ్మరాజ విష్ణువర్ధనుఁడు రాజమహేంద్రుఁడను బిరుదువహించి రాజమహేంద్రవరమను పట్టణమును గట్టించి క్రీ॥ శ॥ 918 సం॥ చాళుక్య రాజధానిని వెంగినుండి యాపురమునకు మార్చెనని చెప్పుదురు. పండ్రెండవ రాజైన విష్ణువర్ధనుఁడు క్రీ॥ శ॥ 843 సం॥ మొదలు కొని పదునెనిమి నెలలుపాలించినవాఁడు. ఇతని కాలమునఁ గొన్ని శాసనములు తెలుఁగుభాషలలోనున్నవి. ఇరువదియొకటవ రాజైన యుద్ధమల్లుఁడు క్రీ॥ శ॥ 927 సం॥ మొదలుకొని 934 సం॥ వఱకును బాలించెను. ఇతని కాలములోని బెజవాడ శాసనములోఁ దెలుఁగుపద్యములున్నవి. ఇరువదియేడవ రాజగు రాజరాజ నరేంద్రుఁడనువాఁడు క్రీ॥ శ॥ 1022 మొదలుకొని 1063 సం॥ వఱకును రాజ్యముపాలించెను. ఇతని పేరటికే శ్రీనన్నయభట్టారకుఁ డాంధ్రభారతమునందు మొదటి మూఁడు పర్వములు రచించి కృతియొసంగెను. భారత మటుతఱువాతఁ బూర్తిచేయకుండఁగనే నన్నయ మరణించెను. అటు తఱువాత వీరి వంశపువారు



చోళదేశమునకు వెళ్ళి యచ్చటనేయుండి మొదట గంగాపురిని, దఱువాత కాంచీపురమును రాజధానిగాఁ జేసికొని చాళుక్యులను పేరు వదలుకొని చోళులను పేరుపెట్టుకొని చంద్రవంశజులమని చెప్పుకొనక పూర్వచోళులవలెనే దామును సూర్యవంశజులమని తెలుపుకొనుచు వేఁగిదేశ పాలకులను వేఱుగాఁ బంపి రాజ్యముచేసిరి. ఈచోళులలో నొక శాఖవారు పాకనాటియందు (నెల్లూరు మండలమునందు) నెల్లూరు రాజధానిగా రాజ్యముఁ జేసిరి. తిక్కనసోమయాజి కాశ్రయుఁడైన మనుమరాజు పాకనాటి చోళులలోనివాఁడే. వీరును సూర్యవంశజులని తిక్కన నిర్వచనోత్తర రామాయణమున వ్రాసియున్నాఁడు. రాజమహేంద్రవరము రాజధానిగాఁగల యీచాళుక్యుల కాలమం దాంధ్రభాషలో సలక్షణమై ప్రశస్తమైన గ్రంధములు మొట్టమొదట రచించిన కవి నన్నయభట్టారకుఁడే. కాఁబట్టియతని నేయాంధ్రభాష కాదికవిగాఁ జెప్పుచున్నారుగాని యాతనికిఁబూర్వమునఁగూడ యాంధ్రసారస్వతము కొంతవఱకు వర్ధిల్లియుండుటచే నితనిని యాంధ్రలక్షణయుక్తమైన ప్రసిద్ధగ్రంధముల కాదికవియని మాత్రము చెప్పఁదగియున్నది. అంతకుఁ బూర్వమింత సలక్షణమైన యాంధ్రకవిత్వము లేనిమాట వాస్తవము. ఇతనికవిత్వముతో సమానముగ వ్రాయఁగలవారు చిరకాలము లేకుండుటచేతనే నన్నయభట్టారకునిచే నారంభింపఁబడిన

యాంధ్రమహాభారతమును బూర్తిచేయుటకుఁ దిక్కనకాలము వఱకును నెవ్వరును రచియింపసాహసింపరైరి. తిక్కనమాత్రము దానిని బూర్తిచేసి నన్నయకవితకు వన్నెవెట్టిన కవియని ప్రసిద్ధిఁజెందెను. ఆతిక్కనకవి గుంటూరి వాఁడగుటచేతను, యాంధ్రకవిసార్వభౌముఁడగుటచేతను, గుంటూరి చరిత్రయం దాతని వృత్తాంతము సంగ్రహముగానైనఁ దెలుపుటయావశ్యకము గనుక నాతనినిగూర్చి ప్రత్యేకముగా నొక ప్రకరణమందు వ్రాయఁబడును.

— • చ తు ర్థ ప్ర క ర ణ ము. • —

# తి క్క న చ రి త్ర ము

తిక్కన సోమయాజి గౌతమ గోత్రుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు; గుంటూరి విభుఁడైన భాస్కరమంత్రికిఁ బౌత్రుఁడు; ఆగ్రామమునకే విభుఁడైన కొమ్మన మంత్రికిఁ బుత్రుఁడు. తల్లి యన్నమ్మ. కొడుకు కొమ్మన. ఇతఁడాఱువేల నియోగులలోని వాఁడని చెప్పెదరు.

ఇతఁడెక్కడివాఁడు?

ఇతఁడు గుంటూరి వాఁడని కొందఱును, నెల్లూరివాఁడని మఱికొందఱును, పాటూరివాఁడని మఱికొందఱును జెప్పుచున్నారు. గుంటూరినుండి నెల్లూరి రాజైన మనుమరాజు నొద్దకు



నాస్థానకవిగా నితఁడు వెళ్ళియుండుటచేత నితని మొదటి నివాసము గుంటూరనియు, ననంతర నివాసము నెల్లూరనియును, మనుమరాజ మరణానంతరము పాటూరనియుఁ, జెప్పవలెను.

ఇతనితాత తండ్రులు గుంటూరి విభులని తిక్కన సోమయాజి తన గ్రంథములలో స్పష్టముగాఁ జెప్పుకొనియున్నాఁడు.

నెల్లూరి సమీపమునందున్న పాటూరిలో నిపుడు కరణిక వృత్తియందున్న శరభరాజుగారు తాము తిక్కనవంశపువారనియుఁ, దిక్కన కొమారుఁడైన కొమ్మన పాటూరి కరణికము సంపాదించిన నాఁటనుండి తిక్కన వంశస్థులైన తమకుఁ బాటూరివారను వంశనామము కలిగినదనియుఁ, దిక్కన వంశావళి కొంతవఱకుఁ దెలిపెడి పూర్వరచిత పద్యమొకటి తనయొద్ద నున్నదనియుఁ, జెప్పుచు నిచ్చిన పద్యములో 'గుంటూరితిక్కయజ్వ'యని తిక్కన సోమయాజినిగూర్చి చెప్పఁబడియున్నది. *

---

* "సీ॥ భారతపర్వము ల్పదియేను వరుసగాఁ దెనిఁగించె గుంటూరి తిక్కయజ్వ
యామహాత్మునిపుత్రుఁ డౌకొమ్మనఘనుండు కల్పించెఁ బాటూరికరణికంబు
నాకొమ్మనకుఁగల్గె హరిహరామాత్యుండు నెమ్మితో నతనికిఁ గొమ్మఘనుఁడు
రహిమీఱ నతనికి రామన తిప్పన యారామనకు సోమయాజ్వ యుండు॥
ఆఘనునకు వీరనామాత్యుఁ డతనికి సోమలింగమంత్రి యామహాత్ము
నకును సోమరాజనాముఁడుఁ జిటివీర ఘనుఁ డనంగ సుతులు గలిగి రందు"

పాటూరి ప్రాచీనపద్యములు.

తిక్కన కొమారుఁడైన కొమ్మనకు దౌహిత్రిపుత్రుఁడైన మడికి సింగనకవి తన వాసిష్ఠ రామాయణములోఁ దిక్కన సోమయాజుల పుత్రుని, గుంటూరి కొమ్మవిభుఁడని చెప్పియున్నాఁడు. *

ఇట్లు పూర్వమందు రెండు తరములవఱకును బరమందు నొకతరమువఱకును గుంటూరి విభుత్వమతనివంశపువారికి నుండియుండుటచే, తిక్కన కావిభుత్వమునందలి సంబంధము తొలఁగినదని యెంచుటకువీలు లేదు. కాఁబట్టి తనకు వంశక్రమాగతమైన గుంటూరి విభుత్వము వదలుకొనక తానును గొంతకాలమునం దాపదవియందుండియో యుండకయో, నెల్లూరియాస్థానమునకుఁ దాను వెళ్లునపుడు తనకొమారుఁడైన కొమ్మన నాపదవియందు గుంటూరుననుంచియుండును. లేదా, యితఁడు నెల్లూరికి వెళ్లునప్పటికి నతని తండ్రియైన కొమ్మన జీవించియుండి గుంటూరియందు విభుపదమందుండియు నుండవచ్చును. తిక్కన గుంటూరి నుండియే నెల్లూరికి వెళ్లెనని ప్రతీతియునుండుటయేకాక పాతగుంటూరి యగస్త్యేశ్వరస్వామివారి యాలయమునకు దక్షిణపుఁబ్రక్కఁ దిక్కనసోమయాజిగారి యిల్లుండెనని వాడుకగూడఁగలదు.

* "అతఁడు తిక్కన సోమయాజుల పుత్రుఁడై కొమరారు గుంటూరి కొమ్మ విభుని। పుత్త్రి చిట్టాంబిక బుధలోక కల్పకవల్లి వివాహమై వైభవమున ..."

చిట్టాంబిక మనుమఁడైన మడికిసింగనచే రచియింపఁబడిన తెలుఁగు వాశిష్ఠ రామాయణములోని పద్యభాగము.



గుంటూరులోని నల్లకాణాంబయను దేవి యితనికి ముఖ్యదేవతయను విషయము నిప్పటికిని బాతగుంటూరులో ననుశ్రుతముగాఁ జెప్పుకొనుచున్నారు.* గుంటూరి తిక్కనయని పాటూరి పద్యమందుండుటకూడ నితఁడు గుంటూరినుండి వెళ్లినవాఁడనుటకు సహకారి. గుంటూరినుండి వెళ్ళినవాఁడుకనుకనే యితనికి గుంటూరి తిక్కనయనుపేరు కలిగియుండవలెను.

ఈకారణములన్నిటినిబట్టి తిక్కన మొట్టమొదట గుంటూరివాఁడేయని సిద్ధాంతము చేయవచ్చును.

ఇఁక నెల్లూరివాఁడనుటనుగూర్చి విమర్శింపవలెను. ఇతఁడు గుంటూరినుండి వెళ్లినతఱువాత నెల్లూరిలోనుండిన మాటసత్యము. ఇతఁడు నెల్లూరియందు మనురాజుయొక్క యాస్థానమందుండినపుడు తిక్కననివాసము విక్రమసింహపురమని చెప్పి (మూలఘటిక) కేతనకవి తన దశకుమారచరిత్రలో నెల్లూరు వర్ణించియున్నాఁడు. ఈవర్ణనవలనఁ దిక్కనసోమయాజి యాకాలమునమాత్రమే యచ్చటనివసించెనని గ్రహింపవలెను; గాని మొదటినుండియు నెల్లూరివాఁడని తలఁపరాదు.

తిక్కనకాశ్రయుఁడైన మనుమసిద్ధి మరణించిన తఱువాతఁ గొంతకాలమునకుఁ బాటూరియందుఁ గాపురముండెనని

* 'నల్లకాణాంబ నాయింటి నాతికొమ్మ' యను పద్యపాదము తిక్కన చెప్పుకొనిన పద్యములోనిదని యిచటఁ జెప్పుకొనుచున్నారు.

యుఁగొందఱు చెప్పుచున్నారు. తిక్కనకు నంత్యదశయందు నెల్లూరిలో రాజాశ్రయము లేక పోవుటచేతను, తిక్కనకొమారుఁడు కొంత కాలముగుంటూరి విభుఁడుగానుండియు నేమికాల కర్మముననో తన గుంటూరి విభుత్వమువదలి పాటూరి కరణికము సంపాదించిన కాలములోఁ దిక్కనయుఁ దనకొమారుఁడైన కొమ్మనతోపాటు చివరకాలమున నందుఁ బాటూరిలోఁ గాపురముగా నుండియు నుండవచ్చును. తిక్కన భారతాదిగ్రంథములు వ్రాసిన గంటముతో సంబంధించిన యొఱ పాటూరి శరభరాజుగారి యింట నిప్పటికి నున్నదఁట. కాఁబట్టి తిక్కన తనజీవితకాలములోని ప్రథమదశలో గుంటూరియందును, మధ్యదశలో నెల్లూరియందును, నంత్యదశలోఁ బాటూరియందును నివసించెనని చెప్పవలెను.

ఇందువలన గుంటూరే తిక్కనకుఁ బ్రథమ నివాసస్థానమని పరమసిద్ధాంతముగాఁ దేలినది కాని మఱియేయితరగ్రామముగాదు.

తిక్కన జన్మస్థానము నెల్లూరైయుండవచ్చునని కొందఱు చెప్పుచున్నారుగాని యాకారణములు సమంజసములుగాఁ దోఁచవు.

అవియెవ్వియనఁగా:—(1) "శ్రీ కాళహస్తి దేవుఁడు" తిరుకాళత్తిదేవుఁడనియు, తిరుకాళదేవుఁడనియు ద్రావిడులు



వ్యవహరించుచున్నారు గనుకను, తిరుకాళశబ్దమునుండి పుట్టినదియే తిక్కన యను పేరుగనుకను, తిక్కన కవికి జన్మస్థానము కాళహస్తి సామీప్యముననున్న నెల్లూరై యుండవచ్చునని కొందఱూహించినారు. ఈయూహ సరియైనదిగాదు. తీర్థక్షేత్ర స్వాములయందలి భక్తిచేత స్వాముల నామములు తమ బిడ్డలకుఁ బెట్టుకొనుట మనదేశమందు సహజముగానున్నది. కాళహస్తి పేరుగలవారెందఱు మన యాంధ్రదేశమున లేరు? వారందఱును గాళహస్తి సామీప్యమున పుట్టినవారా! తిరుపతి పేరుగలవారు తిరుపతి దగ్గఱ జన్మించినవారలా! జగన్నాథ నామముగలవారు జగన్నాథ సామీప్యంబువారా! వేంకటేశ్వరుని పేరుగలవారు వేంకటేశ్వరస్వామి సమీపస్థులా! అట్లు కాదుగదా. భక్తిచేత నెక్కడివారైన దూరస్థులుకూడ నాయా స్వాములపేరులనుబెట్టుకొనుట మన దేశమం దాచారముగా నున్నది. కనుక తిక్కనకవి కాళహస్తీశ్వర నామమగుటచేత నతఁడు కాళహస్తిసామీప్యమునఁ బుట్టియుండవలెననెడి యూహ సరికాదు. గుంటూరిలో, 'తిక్కన' పేరుండుట యాక్షేపణీయముకాదు.

(2) తిక్కన యను పేరు కాళహస్తి సామీప్యముననే గాని యితరస్థలముల లేదని కొందఱన్నారు గాని యది యితర ప్రదేశముల యందును గలదనుటకు నిదర్శనము లనేకములు

న్నవి. 15 వ శతాబ్దియొక్క మొదటిభాగమునందుండిన రసాభరణ భోజరాజీయాది సుప్రసిద్ధ గ్రంథకర్తయైన యనంతామాత్యుఁడు తన తండ్రిపేరు తిక్కన యనియు భీమా, కృష్ణవేణీ మలాపహారీ నదీత్రయాంతర్వేదియగు పావనక్షేత్రమందలి పెరుమగూడిపుర మతని నివాసమనియుఁ జెప్పుకొనెను.

మఱియుఁ దిక్కనకు శిష్యుఁడైన మారన 14 వ శతాబ్దాదియం దోరుగంటి ప్రతాపరుద్రుని మంత్రియైన నాగయగన్ననికిఁ దన మార్కండేయ పురాణమును గృతియిచ్చి తన తండ్రి తిక్కనయని చెప్పుకొనెను. ఇంతియకాక పూర్వమునం దాంధ్రచోడుల కొకరాజధానిగానుండిన కొణిదెన గ్రామములోని తిక్కయయను బట్టువానికి నొక ప్రభువు వృత్తియిచ్చినట్లు కొణిదెన శాసనములలో నొకదానియం దున్నది.

నన్నయకు నన్నిదేవుఁడు, కూచనకుఁ గూచిమంత్రి, రామనకు రామిసెట్టి, పోలనకు 'పోలిరెడ్డి,' యని యిట్లు వారి వారి కులాధికారములను బట్టి నామములు కనఁబడుచున్నవి. కాఁబట్టి తిక్కనయను నొక రెడ్డిపేరే 'తిక్కిరెడ్డి'కావలెను. అతని పేరటి గ్రామము తిక్కిరెడ్డిపాలె మనునది గుంటూరుపుర సమీపముననే యున్నది. కనుక తిక్కనపేరిప్రాంతములందుఁ బూర్వముననుగలదు. కాఁబట్టి తిక్కనపేరు గుంటూరు ప్రాంతములనుండినట్లు స్పష్టము.



ఇంతయేల! 'తిక్కన' యను వానికొక వృత్తియిచ్చినట్లు పాతగుంటూరి యగస్త్యేశ్వరస్వామివారి యాలయములోని పాండ్యరాజశాసనముననే కలదు. కాఁబట్టి గుంటూ రితని జన్మస్థానమన్నను బైయాక్షేపణలు బాధింపవు.

### తిక్కన యెప్పటివాఁడు!

తిక్కన సోమయాజి తాను రచియించిన నిర్వచనోత్తర రామాయణమును నెల్లూరి ప్రభువైన మనుమరాజునకుఁ గృతియిచ్చుటంబట్టియు, నితఁడచ్చట నాస్థానకవిగనుండిన కాలములో నభినవదండియను బిరుదముగల కేతనకవిచే నితనికి సంకితముగా నొనర్పఁబడిన దశకుమార చరిత్రములోని యంశములను బట్టియు, నితఁడు మనుమరాజుకాలపు వాఁడనుట స్పష్టము.

మనుమరాజు 1240, 1260 కు నెల్లూరికి రాజుగానుండెనని శిలాశాసనాది పరిశోధకులు నిశ్చయించి యున్నారు. కనుక తిక్కనయు నప్పటివాఁడేయై యుండవలెను.

ఇఁక నితని జన్మకాలమెప్పుడు? మరణకాలమెప్పుడు? అనుసంశములనిఁక విమర్శింప వలసియున్నది.

నిర్వచనోత్తర రామాయణమునందు, క్రీ॥ శ॥ 1257 58 సం॥ లవఱకు జరిగిన చరిత్రాంశములు సూచింపఁబడినవని చరిత్రకారులు నిశ్చయించియున్నారు గనుకను, కృతిపతియైన మనుమరాజటుతఱువాత శీఘ్రకాలముననే మృతినొందెను

గనుకను, నిర్వచనోత్తర రామాయణము క్రీ॥శ॥ 1257-58 ప్రాంతమునందు రచియించి యుండును. అప్పటికే యితఁడు మహాకవియను కీర్తివడసి యుభయకవిమిత్త్రుఁడనుబిరుదమును మనుమరాజ సభలోనే పొంది దశకుమార చరిత్రమును కృతిగా నొందియునుండెను. కనుక నప్పుడితఁడు కేవలము నాస్థానకవిగా మాత్రమేగాక రాజ్యనిర్వాహక మంత్రిగాఁ గూడ నుండెను గనుకను, నితఁ డుత్తరరామాయణ రచనకాలమునకుఁ బ్రౌఢ వయస్కుఁడై సుమారు ముప్పది నలువది సంవత్సరముల ప్రాయముగలవాఁడై యుండవచ్చును. కాని బాలుఁడై యుండఁడు. కాఁబట్టి యితఁడు క్రీ॥ శ॥ 1220 సం॥ ప్రాంతమున జన్మించి యుండును. అప్పటి కితనికి 38 సంవత్సలముల వయసుండును.

ఇతఁడు నిర్వచనోత్తర రామాయణాశ్వాసాంత్యగద్యములందుఁ దిక్కన యనియు, నాంధ్రభారతమునఁ దాను రచించిన విరాటపర్వాదులైన పదునేను పర్వములలోఁ దుదినున్న గద్యలయందుఁ దిక్కనసోమయాజి యనియుఁ, దన్నుఁగూర్చి వ్రాసికొని యుండుటయేకాక మనుమరాజు పేరెత్తకయు, నతనికిఁ గృతి నొసంగకయునుండుటచే నితఁడు మనుమరాజ మరణానంతరమే భారతము రచియించియుండవలెను. ఇతఁడు మనుమరాజ మరణానంతరము పాటూరునకు వెళ్లెననుటకూడ నితఁడుబహుకాలము జీవించెనని చెప్పఁదగియున్నది. ఇతఁడు దీర్ఘకాలజీవియని లోక



ప్రతీతియుఁ గలదు. 78 సం॥ లితఁడు జీవించెనని సామాన్యముగా వాడుకగలదు. చరిత్రకారులును నితఁడు మనుమరాజునకుఁ దరువాతఁ జాలకాలము జీవించెనని యెంచి కొందఱితఁడు క్రీ॥శ॥1290 వఱకును, మఱికొందఱు క్రీ॥ శ॥ 1300 వఱకును బ్రదికియుండెనని వ్రాసియున్నారు. ఇతని యాయుర్దాయమును గూర్చి కలిగిన లోకప్రతీతినిబట్టి చూచినను, ఇతని మరణకాలము కొంచెమించుమించుగ 1300 సం॥ ప్రాంతమగుచున్నది. లోకప్రతీతి నిజమైనయెడల నితఁడు 1298 సం॥ మృతినొందియుండవచ్చునని యూహింపనగు.

ఇతని జననమరణకాలము లితరగ్రంథ విమర్శనల వలనఁ గూడ నిట్లేనిర్ణయింపఁదగియున్నవి. తిక్కనశిష్యుఁడైన మారన తన మార్కండేయపురాణమును 1295 మొదలుకొని 1323వఱకును రాజ్యముచేసిన యోరుగంటిప్రతాపరుద్రుని సేనాపతియైన నాగయగన్నమంత్రికిఁ గృతినొసఁగిన కాలమునుబట్టియు, తిక్కనచే భవ్యభారతియను బిరుదమునొందిన బయ్యనకవికి మునిమనుమఁడైన యనంతామాత్యకవి తాను రసాభరణగ్రంథమును రచించిన కాలము శా॥ శ॥ 1356( క్రీ॥ శ॥1434) అని చెప్పుకొనియుండుటను బట్టియు, తిక్కనసోమయాజి కుమారుఁడగు గుంటూరి కొమ్మవిభునికి దౌహిత్త్రుని మనుమఁడైన మడికి సింగనమహాకవి తాను గందనమంత్రికిఁ గృతిగా నొసఁగిన పద్మపురాణ రచనకాలము

శా॥ శ॥ 1342 క్రీ॥ శ॥ 1420) సం॥ మని వ్రాసికొని యుండుటం బట్టియు, క్రీ॥ శ॥ 1200-1260 రాజ్యము చేసిన కాకతీయగణపతి దేవరాజునొద్ద దండనాథుఁడైనగన్నయమంత్రి (పైఁజెప్పఁబడిన) కందనమంత్రియొక్క తాతకే తాతయని చెప్పుటను బట్టియు, నింకననేక కారణములఁబట్టియుఁ దిక్కనసోమయాజి జననకాలము క్రీ॥ శ॥ 1220 సం॥ మనియు, మరణకాలము 1298 సం॥ మనియు చెప్పినచోఁ, దరముల లెక్కను నీకాలము సరిపోవుచున్నది.

ఇంతియ కాక చెన్నపట్టణమందలి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమందు మెకంజీదొరగారు కూర్చియున్న లిఖితపత్రికావళిలో శ్రీతిక్కన సోమయాజి జననకాలముఁ గూర్చిన పద్య మొకటియు, మరణకాలమును గూర్చిన పద్యము మఱొకటియు, నుండఁగాఁ జూచిన చరిత్రకారు లనేకు లీపద్యములనంతగాఁ బాటి చేసినవారు కారుగాని యీపద్యములయందుఁగూడఁ గొంతనిజము న్నదని నాతాత్పర్యము. ఎట్లన, పూర్వమెవ్వరో తిక్కనసోమయాజి యొక్క జననమరణకాలపు శాలివాహన సంవత్సరములను, మాసాదులును, ఎక్కడనో వ్రాసిపెట్టియుండఁగాఁ గొంతకాల మున కెవ్వరో యావిషయములను బద్యములుగా మార్చినప్పు డాయంకెలలోఁ బొరపాటు వచ్చియుండవచ్చును. ఇట్లేల చెప్ప వచ్చుననఁగా- జననకాల పద్యమునఁ దిక్కన జననము శా॥ శ॥ 1042 (క్రీ॥ శ॥ 1120) ఫాల్గుణ బ॥ ౧౦ మంగళవారమని



యున్నది. కాఁబట్టి శా॥ శ॥ 1142 అనుటకు మాఱుగా 1042 సం॥ మని పొరపాటున వ్రాయఁబడియుండును. ఆలాగున సవరించినయెడల, ఇంతవఱకు నిర్ధారితమైన 1220 సం॥ మే తిక్కన జననకాల మగుచున్నది. మరణకాలపద్యమందలి శా॥ శ॥ 1120 భాద్రపదమాస మనుదానినిగూడ నిట్లే దిద్దుకొన్నయెడలఁ దిక్కన మరణకాలము శా॥ శ॥ 1120 యనుటకు మాఱుగ శా॥ శ॥ 1220 యగును. అదియే క్రీ॥ శ॥ 1298 యగుచున్నది. కాఁబట్టి యీ రెండు పద్యములును దిక్కన జనన మరణ కాలములను మాసాదులతోఁ గూడ నిశ్చయించుటకుఁ దోడుపడుచున్నవి యని నాతాత్పర్యము.

ఆంధ్రభాషయం దతనికవిత్వముతోఁ బోలిన కృతులిప్పటికిని లేవని పెద్దలునిశ్చయించిరి. మరియు నితఁడు పైగ్రంథములుగాక విజయసేనము, కృష్ణశతకము, కవివాగ్బంధనముకూడ రచించెనని చెప్పుచున్నారు. ఇతఁడు రచించిన భారతభాగమును సర్వేశ్వరస్వరూపుఁడైన, యద్వైతపరబ్రహ్మయగు హరిహరదేవునికిఁ గృతియొసఁగెను. ఇతని యుత్తరరామాయణపద్యములు కొన్ని భారతమున నున్నవి.

## ఐదవ ప్రకరణము.

### చాళుక్యచోడులు - వెలనాటిచోడులు.

### (అను వారి పాలనము.)

(క్రీ॥ శ॥ ౧౦౭౩ మొ॥ ౧౨౨౮ వ వఱకు)

చాళుక్యులపాలన మిదివఱకే వివరింపఁబడెను. రాజరాజనరేంద్రునకు నాంధ్రభారతమున మొదటిమూఁడు పర్వములు కృతియొసంగిన నన్నయభట్టునుగూర్చి తెలుపుచుఁ దక్కిన పదునైదు పర్వములుపూర్తిచేసిన తిక్కనసోమయాజిని గూర్చియు సందర్భవశమునఁగొంత చరిత్రవ్రాయఁబడెను. నన్నయ కాలమునుండి సోమయాజి వఱకును గల గుంటూరువృత్తాంత మిఁకఁ దెలుపవలసియున్నది. రాజరాజనరేంద్రు పుత్రుఁడైన (రాజేంద్రకులోత్తుంగ దేవుఁడు) పితృమరణానంతరము ౧౦౭౩ వేగిదేశసింహాసన మధిష్ఠించి మాతామహునిదైనచోళదేశమును గూడఁదానే వశపఱచుకొని చోళదేశమునకు వెళ్ళి యచ్చటనే నివసించి, తానచటఁజక్రవర్తిగానుండి, వేగిదేశమునకు రాజప్రతినిధులనియమించి వారిమూలమున ౧౧౨౦ సం॥ వఱకును జోళరాజను పేరుతోఁ గాంచీపురమునందుండి, రాజ్యముచేసెను. ఇతనికాలమునుండి చాళుక్యులకుఁ జాళుక్య చోళులని నామముకలిగెను. అప్పటినుండియు వారు చంద్రవంశజులమనక సూర్యవంశజులమని చెప్పుకొనిరి.



ధనదపురము (ఇప్పటిచందవ్

వెలనాడు దేశము (గుంటూరుమండలములోని తూర్పుభాగము)ను, విక్రమసింహపురము (నెల్లూరు) రాజధానిగాఁగల పాకనాటి భాగమైన యొకసంస్థానమును, నర్సారావుపేట తాలూకాలోని కొణిదెనసంస్థానమనెడి మఱియొక పాకనాటిభాగమును జోళచక్రవర్తులకే లోఁబడియుండెను. ఈమాండలికులు గూడఁదామును దమచక్రవర్తులవలెనే చోళరాజులమనియు సూర్యవంశజులమనియుఁ గ్రమక్రమముగా వ్యవహరింపసాగిరి.

ఈ ప్రథమకులోత్తుంగ దేవుఁడు చాళుక్యచోళరాజులలో నెల్ల సుప్రసిద్ధుఁడు. ఇతనిశాసనములు గుంటూరుమండలములో ననేకములు గానంబడుచున్నవి. ఇతనికాలము నుండి చాళుక్యులు, 'చాళుక్యచోళు'లని వ్యవహరింపఁబడుచున్నారు. వెలనాడు రాజ్యము స్థాపించినవాఁడు మల్లవర్మయను వాఁడు. ఈ వంశపువారు చందవ్రోలు రాజధానిగాఁ గ్రీస్తుశకము 1187 సం॥ ప్రాంతము వఱకును రాజ్యముచేసిరి. వీరిలో మొదటి యాఱుగురు రాజులును వేగిదేశచాళుక్యులకు సామంతులుగానుండినట్లుగానఁబడుచున్నది. ఏడవరాజైన వెలనాటి గొంకరాజను వాఁడు (ప్రథమ) కులోత్తుంగ చోడదేవునికి సామంతుఁడు. ఈగొంకరాజునకు గోవిందామాత్యుఁడును, గొంకరాజ పుత్రుఁడైన వెలనాటి (కులోత్తుంగ రాజేంద్ర) చోడునకు గో

విందామాత్య పుత్రుఁడును, మంత్రులుగానుండిరని మంచనకవి తన కేయూరబాహుచరిత్రలో వివరించియున్నాఁడు. కులోత్తుంగ చోడదేవచక్రవర్తి యీ వెలనాటిచోడునిఁ దనదత్తపుత్రునిగా గ్రహించి వేగిదేశమితనికిధారవోసెను. అప్పటినుండియు వెలనాటి చోడులే కొంతకాలము వఱకు వేగిదేశమునకుఁ గూడఁ బరిపాలకులైరి.

మఱియు నీ 'వెలనాటి చోడుఁడు' కొణిదెనసంస్థానమును నన్నెచోడుని యొద్దనుండి జయించి కొమ్మనామాత్యునారాజ్యమునకుఁ బరిపాలనాధికారిగా నేర్పఱిచెను. ఈ వెలనాటి చోడుని కొమారుఁడైన రెండవగొంకరాజు కులోత్తుంగచోళ రాజపుత్రుఁడైన విక్రమచోడునికిఁ గొంతకాలము సామంతుఁడై యుండియు మధ్యకాలమునఁ బశ్చిమచాళుక్యుఁడైన విక్రమాదిత్యునికి లోఁబడి మఱల విక్రమచోడునికే సామంతుఁడయ్యెను. విక్రమచోడచక్రవర్తి పుత్రుఁడైన (రెండవ)కులోత్తుంగదేవుని కాలములోఁ బండ్రెండవ శతాబ్దపుఁ జివర కాలములో, వేగిదేశపూర్వచాళుక్యవంశములోఁ బదునేడవవాఁడైన పేటరాజునకుఁ దఱువాత నతని శాఖవారు వేగిదేశమును స్వాధీనము చేసికొనఁగా, వెలనాటిరాజులకు వేగిదేశమందుఁగల యధికారము పోయినట్లు కనఁబడుచున్నది.

రెండవ గొంకరాజు తఱువాత నతని కొమారుఁడైన వెలనాటి వీరరాజేంద్ర చోళుఁడును, ఆతనిపుత్రుఁడైన వెలనాటి



(మనుమ) గొంకరాజును, పౌత్రుఁడైన పృథ్వీశ్వర రాజును చాళుక్య చోళరాజులకు సామంతులైయుండినట్లు కనఁబడుచున్నది. విక్రమ చోళుని తఱువాత 'రెండవ'కులోత్తుంగచోళదేవుఁడు **(1143-1158)**, రాజేంద్ర చోళుఁడు **(1158-1200)**, రాజరాజ చోళుఁడు, **(1200-1235)** వీరరాజేంద్ర చోళుఁడు, ననువారు క్రమముగాఁ జోళచక్రవర్తులై యుండిరి. పాకనాటిలోని నెల్లూరు రాజులును, కొణిదెన రాజులును, కాకతీయ గణపతి దేవుఁడు తమ రాజ్యముల జయించు వఱకును చాళుక్యచోడచక్రవర్తులకు సామంతులుగా నుండినట్లే వ్యవహరించిరి. వెలనాటి చోళ రాజ వంశజులలోఁ గడపటివాఁడైన పృథ్వీశరాజును నెల్లూరి రాజైన మనుమసిద్ధి రాజునకుఁ దండ్రియైన తిక్కరాజు యుద్ధములో జయించి సంహరించినట్లు తిక్కన తన యుత్తరరామాయణములో వ్రాసియున్నాఁడు. ఈ యుద్ధము క్రీ॥ శ॥ 1187 సం॥ ప్రాంతమున జరిగి యుండునని చరిత్రకారులు చెప్పుచున్నారు. పృథ్వీశరాజు ననంతరమునఁ గొలఁది కాలమునకే (1228 సం॥ ) కాకతీయ గణపతి దేవరాయలచే వెలనాడు జయింపఁబడి యప్పటినుండి **1324** సం॥ వఱకును గాకతీయుల పాలనలోనే యుండెను.

## ఆ ఱ వ ప్ర క ర ణ ము.

## కా క తీ యు ల పా ల న ము.

[క్రీ॥ శ॥ ౧౨౨౮ మొ॥ ౧౩౨౩ వఱకు.]

కాకతీయులు వెలనాడుదేశమును **1228** సం॥ జయించి **1323** సం॥ వఱకును బాలించిరి గనుక వెలనాటిలో నంతర్భాగమైన గుంటూరు వారిపాలనక్రింది కప్పుడువచ్చెను.

వీరిపూర్వులు 'కాకతి' యనుదేవత నుపాసించినవారగుటచే వీరికిఁ గాకతీయులనుపేరుకలిగెను. ఈకాకతీయులు మొట్టమొదటఁ బశ్చిమచాళుక్యులక్రింద మండలాధిపతులైయుండి క్రమక్రమముగా స్వతంత్రులై **1126** సం॥ త్రిలింగరాజ్యమును స్థాపించి మొదట ననుమకొండను దరువాత నోరుగల్లును రాజధానిగాఁ జేసికొని పాలించిరి.

ఈరాజ్యస్థాపకుఁడు కాకతిప్రోలరాజు (1126-1140). అతనికొమారుఁడు (మొదటి, ప్రతాపరుద్రుఁడు (1140-1196). అతనిపుత్రుఁడు కాకతిమహాదేవరాజు (1196-1199). ఇతనికుమారుఁడు గణపతిదేవరాజు (1199-1260. ఇతఁడే 1228 సం॥ వెలనాడుదేశమును జయించినవాఁడు. ఇతఁడును, నీతనికొమార్తె రుద్రమదేవి (1261-1295) యును, నీమెదౌహిత్రుఁడు రెండవప్రతాపరుద్రుఁడు (1295-1323) ను, వెలనాటిదేశమున మాండలికరాజులమూలమున బాలించినట్లు కానఁబడుచున్నది.



గణపతిదేవునిమంత్రులలో నొకఁడైన గోపరాజురామప్రధాని గ్రామకరణికములను గంసాలులనుండి బ్రాహ్మణులకిప్పించినట్లు ప్రసిద్ధిగలదు. ఏ యేకుటుంబములవారికే యేగ్రామములకరిణికముల నిప్పించెనో దండకవిలెలను గ్రంథములయందు స్పష్టముగాఁ దెలుపఁబడియున్నది.

గణపతిదేవుఁడు వెలనాటినిజయించిన కొంతకాలమునకింకను దక్షిణముననున్న రాజ్యమును జయించి 'గంగయసాహిణి' యనునొకనిని పాలనాధికారిగా నియమించినకాలములో గుంటూరతనిపాలనక్రిందఁ గొంతకాలముండెనని తోఁచుచున్నది.

గంగయసాహిణికి రక్కసగంగఁడనియుఁ బేరు. ఇతనిని నెల్లూరిరాజైన మనుమసిద్ధి జయించియు రాజ్యాంగములమఱల నిచ్చి యతనినివదలిపెట్టెనని తిక్కన తనయుత్తరరామాయణమునఁ జెప్పియున్నాఁడు.

గణపతిదేవుని యనంతరమున రాజ్యమునకు వచ్చిన రుద్రమదేవి గణపతిదేవునికి భార్యయని విద్యానాథకృత ప్రతాపరుద్రీయ భాష్యకారుఁడును, 'మార్కోపోలో' యను నిటలీదేశీయ యాత్రికుఁడును, జెప్పియున్నారుగాని ప్రకృత విమర్శనములవలన నామె గణపతిదేవునికొమార్తెయని యిప్పటి చరిత్రకారులు నిశ్చయించియున్నారు. రుద్రమదేవి గణపతి

దేవుని కొమార్తెయని గుంటూరు మండలములోని పెదకాకానిలో గోపాలస్వామియాలయమందున్న శిలాశాసనమున నున్నది.

రుద్రమదేవికి దౌహిత్రుఁడైన ద్వితీయ ప్రతాపరుద్రుఁడు ప్రథమ ప్రతాపరుద్రునివలెనె యాంధ్రగీర్వాణకర్ణాట కావ్యకర్తయై బహుకవీంద్రుల నాదరించినవాఁడు. ఇతని సేనానులలో నొకఁడైన నాగయగన్ననికే తిక్కన సోమయాజి శిష్యుఁడైన మారన తన మార్కండేయ పురాణమును కృతిగా నిచ్చెను. ఇతనికి మఱియొక సేనానియైన సాహిణిమారునికే హుళక్కి భాస్కరాదులచే రచియింపఁబడిన రామాయణ మంకితము చేయఁబడెను.

ఈప్రతాపరుద్రుని (1323 సం॥) ఢిల్లీ చక్రవర్తియైన యల్లాయుద్దీనను వాఁడు జయించి యోరుగంటి రాజ్యమును స్వాధీనపఱచుకొని రాజును జెఱపట్టఁగా నతని మంత్రియైన యుగంధరుఁడతనిని విడిపించెనని కథలు చెప్పెదరు. ఎట్లయిననేమి గాని కాకతీయరాజ్యము 1323 సం॥ ఢిల్లీలోని తురుష్కుల స్వాధీనమైనసంగతి నిశ్చయము. ఆసందర్భముననే కాకతీయుల యొద్ద సైన్యాధిపతిగానుండిన ప్రోలయవేమారెడ్డి తురుష్కుల నిగ్రహించి 1324 సంవత్సరప్రాంతమున దద్దంకియందు రెడ్డిరాజ్యము సంస్థాపించెను.

---



## ఏడవ ప్రకరణము.

### • రెడ్ల పరిపాలనము. •

[క్రీ॥ శ॥ 1324 సం॥ మొ॥ 1424 సం॥ వఱకు]

**1324** సం॥ కాకతీయరాజ్యానంతరమేర్పడిన రెడ్డిరాజ్యములో గుంటూరు చేరినందున, అది యప్పటినుండి **1424** సం॥ వఱకును నూఱుసంవత్సరము లాఱుగురు రెడ్డిరాజులచేఁ బాలింపఁబడెను. వీరు బహుతరముగా విద్వాంసులై రసికులై పండితులను సన్మానించి యనేకములైన యగ్రహారములను వారి కిచ్చి ధర్మపరిపాలన మొనర్చిరి. సముద్రవ్యాపారమును వృద్ధి చేసిరి. వీరిలో మొదటియిద్దఱికి నద్దంకి రాజధాని. తక్కిన నలుగురు కొండవీడు రాజధానిగాఁ జేసికొనిరి. వీరు పంటరెడ్లు.

ఈరెడ్డిరాజులయింటిపేరు 'దేసటి'వారని యెఱ్ఱాప్రెగడయు శ్రీనాథుఁడును వ్రాసిన కొన్ని గ్రంథములయందును దొంతివారని దండకవిలెలయందును గానంబడుచున్నది. ఈ రెడ్డిరాజులపూర్వుఁ డొకప్పుడు తమయింటికివచ్చిన కోమటివేమన యనెడి యొకసిద్ధపురుషుని స్పర్శవేదిని (ఇనుమును బంగారము చేయఁగలవస్తువును) సంగ్రహించి యింటికినిప్పంటించి దానిలోనే యది తగులఁబడినదనఁగా నతఁడామంటలోఁబడిచచ్చి స్వప్నమందు వారికిఁ గనఁబడి దుఃఖించినవాఁడై తన స్పర్శవేదివలన సంపాదించినద్రవ్యమును ధర్మవినియోగముచేయుచు వేమన

యను తనపేరు పెట్టుకొనుచున్న యెడల నూఱుసంవత్సరములు రాజ్యముచేయఁగలరనియు, లేనియెడల వంశక్షయమైపోవుదురనియు, శపింపఁగా వారు 'వేమన'పేరుపెట్టుకొని యీఱుగురు నూఱుసంవత్సరములు రాజ్యము చేసిరని యొక కథ చెప్పుదురు.

1. ప్రోలయ వేమారెడ్డి (1324-1350) యొద్ద శంభుదాస ప్రబంధపరమేశ్వరాది బిరుదాంకితుఁడై కవిత్రయములోఁ జేరిన (చెదలువాడ) యెఱ్ఱాప్రెగడ యాస్థానకవిగానుండి రామాయణ, హరివంశముల నీవేమారెడ్డికి నంకితమొనర్చి యాంధ్ర భారతారణ్యపర్వశేషమును నన్నయరచనగానే పూరించి యింకను నరసింహపురాణాది గ్రంథముల రచించి ఖ్యాతివహించెను. ఈ కవి తిక్కన సోమయాజికిఁ దఱువాత నుండినవాఁడు.

ఈరాజునకు రామాప్రెగడయు మల్లినాథుఁడును ముఖ్యమంత్రులుగాను, నితనితమ్ముఁడు మల్లారెడ్డి ముఖ్యసేనానిగాను, నుండిరి. ఇతఁడు శ్రీశైలమునకు మెట్లుకట్టించెను.

2. అనపోతరెడ్డి (1350-1362) ప్రోలయవేముని జ్యేష్ఠపుత్రుఁడు. ఇతనితమ్ముఁడైన యనవేమారెడ్డియుఁ, బ్రథమసోదరియగు దొడ్డాంబికకు భర్తయైన కాటయవేమారెడ్డియు, ద్వితీయ సోదరియగు వేమాంబికకు భర్తయైన నల్లనూకరెడ్డియు, నితనికి ముఖ్యసేనానులుగా నుండిరి.



3. అనవేమారెడ్డి (1362-1380) యనపోతరెడ్డికిఁ దమ్ముఁడు. ఇతఁడు రసికుఁడై యుదారుఁడై కవిజన కల్పతరువని ప్రసిద్ధి చెంది యనేకవిధముల స్తోత్రపాత్రుఁడాయెను. రాజధాని నద్దంకినుండి కొండవీటికి మార్చినవాఁడితఁడే.

4. కుమారగిరివేమారెడ్డి (1380-1400) యనపోతరెడ్డికిఁ బుత్రుఁడు. ఇతని సోదరియగు మల్లాంబికకు భర్తయైన కాటయవేమారెడ్డియందు రాజ్యభారమంతయు నునిచి తాను విద్వద్గోష్ఠియందును వసంతోత్సవములయందును గాలము గడిపెను. ప్రోలయవేమారెడ్డికిఁ బ్రాపుగానుండిన యవచి దేవయసెట్టికిఁ బుత్రుఁడై సముద్రవ్యాపారదక్షుఁడగు తిప్పయసెట్టి యీకుమారగిరిరెడ్డికిఁ బరమాప్తుఁడై సుగంధభాండాగారాధ్యక్షుఁడుగా నుండెను. ఈతిప్పయసెట్టికి బాలసఖుఁడైన శ్రీనాథకవి సార్వభౌముఁడుతన వార్ధకదశయందు హరవిలాసమను గ్రంథమును గృతియొసంగెను.

కుమారగిరిరెడ్డి తనతూర్పురాజ్యములోని రాజమహేంద్రవరదేశమును దనబావమఱిదియైన కాటయవేమునికి భాగించియిచ్చెను. అప్పటినుండియుఁ గాటయవేముని వంశీయులే రాజమహేంద్రవరరాజ్యమును 1228 సం॥ కాకతీయులుజయించువఱకును పాలించిరి. శ్రీనాథుఁడు కాశీఖండ భీమపురాణములను రచించుట యీరాజమహేంద్రవరప్రభువులైన వేమా

రెడ్డి వీరారెడ్డి యనువారి ప్రోత్సాహముననే. కుమారగిరిరెడ్డి సంస్కృతమున వసంతరాజీయమనెడి యొక నాటకలక్షణగ్రంథమును రచింపఁగా, నితనిమఱంది కాటయవేముఁడు కాళిదాస మహాకవికృతములైన నాటకత్రయమునకు వ్యాఖ్యలొనర్చెను.

5. పెదకోమటి వెంకారెడ్డి [1400-1420] ప్రోలయ వేమారెడ్డికిఁ బుత్రుఁడైన మాచారెడ్డికి మనుమఁడు. ఇతఁడును శ్రీశైలమునకు మెట్లుకట్టించెను. ఇతనియొద్ద మామిడిపెద్దనకుఁ బుత్రుఁడును సోమసిద్ధాంతవ్యాఖ్యానకర్తయునైన సింగనామాత్యుఁడు ముఖ్యమంత్రిగా నుండెను. పెదకోమటి వెంకారెడ్డియాస్థానమందు నభినవభట్టబాణ బిరుదాంకితుఁడైన వామనభట్టు ముఖ్యకవీంద్రుఁడుగాను శ్రీనాథుఁడు విద్యాధికారిగాను నుండిరి. వామనభట్టు వీరనారాయణ చరిత్రమను పేర వేమభూపాలచరిత్రము సంస్కృత వచన కావ్యముగా రచించెను. శ్రీనాథుఁడు శ్రీహర్షకృతసంస్కృత నైషధమును శృంగార నైషధమను పేరఁ దెలుఁగునఁ బద్య కావ్యముగా రచియించి సింగనామాత్యునికిఁ గృతియొసంగెను. ఈ వెంకారెడ్డి రచియించినట్లు వ్రాయఁబడిన శృంగారదీపిక యను సంస్కృత గ్రంథము కలదు. దీనిని శ్రీనాథుఁడే రచించి తనరాజైన వెంకారెడ్డిపేరు పెట్టియుండునని కొందఱనుచున్నారు.

ఈ వెంకారెడ్డికి భార్యయు, ధాన్యవాటి (ధరణికోట) ప్రభువైన గన్నభూపాలునికిఁ బుత్రికయునైన సూరాంబ శా॥



శ॥ 1331 సం॥ (క్రీ॥ శ॥ 1440) సం॥ సంతానసాగరమనెడి యొక చెఱువు త్రవ్వించి ప్రతిష్ఠించెనని ఫిరంగిపురములో వీరభద్రుని గుడియెదుట నొక శిలాశాసనమున్నది. ఈమెకొడుకు రాచవేముఁడీ చెఱువునకు నీటివసతికై శా॥ శ॥ 1337 (క్రీ॥ శ॥ 1416) సం॥ జగనొబ్బకాలువ యనునొక కాలువ త్రవ్వించెనని యమీనాబాదులో నొక శాసనమున్నది.

ఈ పెదకోమటికాలములోని యీశాసనములును నింక ననేకతామ్రశాసనములును విద్యాధికారియైన యీ శ్రీనాథునిచే రచియింపఁబడినవి.

6. రాచవేమారెడ్డి (1420-1424) పెదకోమటి వెంకారెడ్డికిఁ బుత్రుఁడు. ఇతని దుష్పరిపాలనముచే రాజ్యమరాజకమై 1424 సం॥ ప్రాంతమున నప్పటి (ఆఱవ) కర్ణాటరాజైన ప్రౌఢదేవరాయల యధీనమాయెను.

---

## ఎనిమిదవ ప్రకరణము

### • కర్ణాటరాజులు - గజపతిరాజులు •

### కర్ణాటదేశ ప్రభువుల ప్రథమపరిపాలనము.

[క్రీ॥ శ॥ 1424 సం॥ మొ॥ 1447 వఱకు]

1424 సం॥ ప్రాంతమున విజయనగరము రాజధానిగాఁ గర్ణాటదేశమునేలిన యాఱవరాజైన ప్రౌఢదేవరాయలు

కొండవీటి రాజ్యమును రాచవేమారెడ్డియొద్దనుండి జయించి తీసికొన్నప్పటినుండి యీదేశము 1447 సం॥ ప్రాంతము వఱకును గర్ణాటదేశములోఁ జేరినందున నిందలి గుంటూరు కూడఁ గర్ణాటరాజులయధీనముగా నుండవలసివచ్చెను. ప్రౌఢదేవరాయని యనంతరమున నతనికుమారుఁడైన మల్లికార్జునరాయలు 1447 సం॥ సింహాసనమునకు వచ్చెను. అప్పుడు కటకపురి రాజధానిగాఁ గల కళింగదేశము నేలుచుండిన కపిలేంద్రగజపతి దిగ్విజయయాత్ర వెడలి కొండవీటిరాజ్యమును స్వాధీనపఱచుకొని కొండవీటికి గణదేవుఁడనువానిని బాలనాధికారిగా నియమించెను. అప్పుడు గుంటూరును గజపతులకు వచ్చెను.

### గజపతిరాజులపాలనము.

[క్రీ॥ శ॥ 1447-1515.]

1447 సం॥ ప్రాంతమునుండి 1515 వఱకును గజపతులచే నియమింపఁబడిన వారై వారిప్రతినిధులు కొండవీడు రాజ్యము పాలించిరి. గణదేవుఁడు (1447-1461) పాలించినతఱువాత వీరపురుషోత్తమ గజపతి (1461-1496) కొండవీటి రాజ్యమున గజపతి రాజప్రతినిధిగా నుండెను. వీరరుద్రగజపతి కళింగ రాజ్యాధిపతిగా నుండినపు డతనిప్రతినిధి వీరభద్రగజపతి (1496-1515) కొండవీటియందు రాజ్యముచేయుచుండెను. ఇతనికిఁ గసవాపాత్రుఁడు మొదలగువారు సేనానులైయుండిరి.



ఆకాలమందు విజయనగరము రాజధానిగాఁ గల కర్ణాట దేశము*నకుఁ బ్రభువైన మహారాజాధిరాజ రాజపరమేశ్వరాది బిరుదాంకితుఁడైన సుప్రసిద్ధ చక్రవర్తియగు కృష్ణదేవరాయలు కొండవీడు రాజ్యముజయించి దానిని మఱలఁ గర్ణాటరాజ్యములోఁ జేర్చుకొనెను. అప్పటినుండియుఁ గొండవీటి రాజ్యములోని గుంటూరును గర్ణాటరాజ్యములోఁ జేరెను.

### కర్ణాటదేశప్రభువులద్వితీయపరిపాలనము.

[క్రీ॥ శ॥ 1515 సం॥ మొ॥ 1565 వఱకు.]

1515 సం॥ కృష్ణదేవరాయలు జయించినది మొదలుకొని 1530 సం॥ వఱకుఁ గొండవీడురాజ్యము నితఁడు ప్రతినిధుల మూలముగాఁ బాలించెను. ఇతఁడు కృష్ణానదీ దక్షిణదేశమంతయు వశపఱచుకొని యేలెను. ఇతఁడు ముక్కుతిమ్మన, యల్లసాని పెద్దన మొదలగు మహాకవులచేఁ గృతులుగైకొని తాను బెక్కుకావ్యములు రచించి యాంధ్రభాషను ముఖ్యముగా నాదరించుటచే నితనికి నాంధ్రభోజుఁడను బిరుదు కలి

* 1336 సం॥ హరిహరరాయలు బుక్కరాయలు నను సోదరులు సుప్రసిద్ధవేదభాష్యకారులైన విద్యారణ్యయతీంద్రులవారి ప్రేరణచే బళ్ళారి మండలములోని యానెగొందిదగ్గఱఁ దుంగభద్రాతీరమున రామాయణకాలపు నాఁటి కిష్కింధాపట్టణస్థానములో 'విద్యానగర'మను పేర నొక పట్టణము గట్టించిరి. అదియే రానురాను విజయనగరసంస్థానమని పేరు వచ్చెను. ఈ విజయనగరసంస్థానమునకే పూర్వగ్రంథములయందుఁ గర్ణాటకదేశమని వ్యవహరింపఁబడెను.

గెను. తిమ్మరుసు, చిట్టరుసు మొదలగువారితనిమంత్రులు. ఇతఁడు కొండవీడురాజ్యమును 1515 సం॥ పూర్వదేశదిగ్విజయకాలమందు గజపతులనుండితీసికొన్నపు డారాజ్యమునకు మొదట నప్పామాత్యునిని, దరువాత గోపరాజును రాజప్రతినిధులనుగా నియమించెను.

కృష్ణరాయుని యనంతరమున నతని సవతితమ్ముఁడైన యచ్యుతదేవరాయలు (1530–1542)ను, నచ్యుతరాయునిసోదరపుత్రుఁడైన సదాశివదేవరాయలు (1542–1565)ను, గొండవీడు రాజ్యమును బ్రతినిధులమూలముగాఁ బాలించిరి.

1565 సం॥ భామినీరాజ్యపు సుల్తానులైన(బిదరు, బిరారు, గోలకొండ, విజాపురము, అహమ్మదనగరము ననునైదురాజ్యముల) దురుష్కప్రభువులలో బిరారుసుల్తానుగాక తక్కిన నలుగురును సదాశివరాయని మీఁదికివచ్చి తాళికోటయుద్ధములో నోడించి యతనిరాజధానియైన విజయనగరమును బాడుచేసి యతనిరాజ్యనిర్వాహకకర్తయుఁ గృష్ణరాయని యల్లుఁడునైన (యళియ)రామరాజును సంహరించి కర్ణాటరాజ్యములోఁ గొంత భాగమును వశపఱచుకొనఁగాఁ గుతపశాహివంశమునందు మూఁడవరాజైన యిబ్రహీమనెడి గోలకొండతురుష్కప్రభుపునకుఁ గొండవీడురాజ్యము సంక్రమించుటచే దానిలో నంతర్భాగమైన గుంటూరును మహమ్మదీయులపాలాయెను.

---



## —* తొమ్మిదవ ప్రకరణము. *—

### మహమ్మదీయుల పాలనము.

[కుతపశాహివంశము [1565–1687]

1512 సం॥ కుతుబ్ షాయనువాఁడు భామినీరాజ్యమునుండి గోలకొండరాజ్యమును విడఁదీసికొని స్వతంత్రుఁడై 1543 సం॥ వఱకును బాలించెను. ఇతనిపేరటనే యీవంశము కుతపశాహివంశ మనఁబడుచున్నది. ఇతనితరువాత నితనిద్వితీయపుత్రుఁడు జామ్షీదు (1543-1550) రాజ్యమునకువచ్చెను. ఆతని పిమ్మట నతనితమ్ముఁడైన యిబ్రహీంషా (ఇభరాంషా) యనువాఁడు 1550 సం॥ గోలకొండ సింహాసనమెక్కెను. 1565 సం॥ ప్రాంతమునఁ గొండవీడురాజ్యము సంపాదించి యేలిన ప్రథమమహమ్మదీయ రాజితఁడే. అద్దంకి గంగాధర కవివలనఁ దపతీ సంవరణోపాఖ్యానమను తెలుఁగుపద్యకావ్యమును గృతినొందినవాఁడితఁడే. ఇభరాంపట్టణమని తనపేరఁ బురనిర్మాణము చేయించిన దితఁడే. పొన్నిగంటి తెలగనార్యునిచే యయాతిచరిత్రమను నచ్చతెలుఁగు కావ్యమును గృతినొందిన యమీర్ఖానున కాశ్రయుఁడతఁడే. హిందువుల కితఁడు తన రాజ్యమున నున్నతపదవులనిచ్చెను.

ఇబ్రహీంషాకుఁ దరువాత మహమ్మదు కుతుబ్ షా [1581–1611] అబ్దుల్ హుసేను [1611–1687] నను వారు

గోలకొండ ప్రభువులుగా నుండిరి. 1687 సం॥ ఢిల్లీ చక్రవర్తిగా నుండిన యౌరంగజీబు [అలంఘీరుపాదుషా] గోలకొండ రాజ్యము జయించి దానిని ఢిల్లీకి సామంతరాజ్యముగాఁ జేసెను. ఇంతలోనే యీ గోలకొండ రాజ్యమునకు హైదరాబాదు రాజధానియాయెను. అప్పటినుండి దీనికి హైదరాబాదు రాజ్యమని పేరు.

అసఫ్ జా యను నతఁడు [1724–1748] ఢిల్లీ చక్రవర్తిని ధిక్కరించి స్వతంత్రుఁడై హైదరాబాదు రాజ్యము పాలించెను. ఇప్పటి నిజామువంశమునకు మూలపురుషుఁడు. ఇతని తఱువాత నితని ద్వితీయపుత్రుఁడైన నాజీరుజంగును దౌహిత్రుఁడైన ముజఫర్ జంగును సింహాసనమునకుఁ బోరాడఁగా, ముజఫరు జంగుపక్షము ఫ్రెంచివారును నాజీరుజంగుపక్షము నింగ్లీషువారును వహించిరి. ఇంతలో నాజీరజంగాకస్మికముగాఁ జనిపోవుటచే ఫ్రెంచివారు ముజఫరుజంగును నిజాముగాఁ జేసిరి. ఇతఁడును 1751 సం॥ మరణింపఁగా ఫ్రెంచివారు నాజీరుజంగు తమ్ముఁడైన సలాబత్ జంగును నిజాముగాఁ జేసిరి. ఇతఁడు ఫ్రెంచివారిని దనకు ముఖ్యమిత్రులుగాఁ జేసికొని 'బుస్సీ' యను ఫ్రెంచిసేనానిని దనకు ముఖ్యాలోచన కర్తగా నుంచుకొని పాలించెను.

1753 సంవత్సరమునం దీనిజాముప్రభువు 'బుస్సీ' యను వానికి 'ఉత్తరసర్కారు' లను [అనఁగా నిప్పటి గుంటూరు, గంజాము, విశాఖపట్టణము, కృష్ణా, గోదావరీమండలముల నెడి



యైదుజిల్లాలను) స్వాధీనపఱచి యాజిల్లాలమీఁదనచ్చు శిస్తు వసూలుచేసికొను నధికార మిచ్చెను.

1758 సం॥ దక్షిణ హిందుస్థానములో ఫ్రెంచివారికి ముఖ్యస్థానమైన పుదుచ్చేరికివచ్చిన 'లాలీ' యను ఫ్రెంచి సేనాధ్యక్షుఁడు చెన్నపురిమీఁదికి వెళ్లఁదలఁచి యుత్తరసర్కారులలో నున్న 'బుస్సీ'ని దనకు సహాయము చేయునిమిత్తమై పిలిపించుకొనిన సమయములో, బంగాళదేశమునుండిన రాబర్టు క్లైవు నెడి సుప్రసిద్ధుఁడైన యాంగ్లేయమహాశూరుఁడు కల్నల్ ఫోర్డను వాని నుత్తరసర్కారుల మీఁదికిఁ బంపఁగా నతఁడు కొండూరి యొద్ద స్వల్పముగానున్న ఫ్రెంచిసేనను సులభముగా నోడించెను. దీనిచే నింగ్లీషువారి యధికార మిచటఁ బ్రబలెను.

1761 సం॥ సలాబత్ జంగును జంపి యతనితమ్ముఁడైన 'నిజామల్లీ' యను వాఁడు హైదరాబాదులోఁ బ్రభువాయెను.

1765 సం॥ నిజాము 'ముర్తుజా నగరుసర్కారు' (గుంటూరు మండలము)గాక తక్కిననాలుగుసర్కారులనింగ్లీషువారికిచ్చి గుంటూరు సర్కారు మాత్రము తనతమ్ముఁడైన బసాలత్ జంగునకు జీవితాంతము వఱకును 'జాగీరు'గా నుండి తఱువాత నింగ్లీషువారికిఁ జేరునట్లు విధించెను.

1788 సం॥ బసాలత్ జంగు ఫ్రెంచివారితోఁ జేరి యింగ్లీషువారికి విరోధముగా దుస్తంత్రములు చేయుచున్నట్లు తెలిసి

నందున నతఁడు జీవించియుండఁగానే (యీసంవత్సరముననే) యింగ్లీషువారు గుంటూరుసర్కారు స్వాధీనపఱచుకొనిరి. ఈసంవత్సరమే గుంటూరియం దింగ్లీషువారిపాలన మారంభ మాయెను.

---

## పదవ ప్రకరణము.

### ఆంగ్లేయులపాలనము-జమీందారీ పాలనము.

(1788 సం॥ మొదలుకొని యిప్పటికిని)

1788 సం॥ (కారన్‌వాలీసుప్రభువు రెండవ గవర్నర్ జనరలుగానుండఁగా) ముర్తుజాన్ నగరుసర్కారు (గుంటూరు జిల్లా) వచ్చినందున, నప్పటినుండియు నింగ్లీషువారిచే నియమింపఁబడినమండలాధిపతులచే గుంటూరు పాలింపఁబడుచుండెను.

ఆకాలమందు గుంటూరుమండలమున మానూరువారు, వాసిరెడ్డివారు, మల్రాజువారు, మాణిక్యారావువారు నను నలుగురు జమీన్‌దారులుండిరి. వారు పూర్వము నిజాములకు లోఁబడియుండిరి గనుక నింగ్లీషుప్రభుత్వకాలమునుండి వీరికి లోఁబడవలసినవారైరి.

1793 సం॥ కారన్‌వాలీసుచే నేర్పఱుపఁబడిన శాశ్వతరివిన్యూవసూలు పద్ధతి నాలుగవ గవర్నరు జనరలయిన మార్క్విసువెలస్లీ ప్రభువుచే 1802 సం॥ అమలులోనికి వచ్చినందున జమీన్‌దారులు ప్రతిసంవత్సరమును నింగ్లీషువారికిఁ



చెల్లింపవలసిన శిస్తుపరిమాణమింతయని నియామకము చేయఁబడెను. 1836 సం॥ ఆక్లండు ప్రభువుకాలములో నాంగ్లేయులిచ్చటి జమీందారుల యొద్దనుండి రాజ్యము నధీనముచేసికొని 1845 సం॥ నవంబరు నెల 8 తేదిని హార్డింజి ప్రభువుకాలమున వీరికి మనువృత్తులనిచ్చిరి.

ఈనలుగురు జమీన్‌దారులలో వాసిరెడ్డివారివంతు నకువచ్చెను. గాని యందఱు నిందు వేఱువేఱు కోటలుకట్టుకొని నివసించిరి. తరువాత మల్రాజువారు నరసారావుపేటకును మాణిక్యారావుగారు రేపల్లెకును వెళ్ళిపోయిరి. తక్కిన యిద్దరిలో వాసిరెడ్డివారు 'అమరావతి'ని నూతనరాజధానిగాఁ జేసికొని గుంటూరికి వచ్చుచుఁ బోవుచుండిరి. మానూరివారును సత్తెనపల్లి చిలకలూరిపేటయను గ్రామములు ముఖ్యస్థానములనుగాఁ జేసికొని గుంటూరు నివాసము పూర్తిగావదలకుండిరి.

### గుంటూరి జమీన్‌దారులు.

(1) వాసిరెడ్డివారి వృత్తాంతము—సదాశివయ్య యను నొక మహాశూరుఁడు యోధపతియును నొక రెడ్డిపక్షమున శత్రువులతోఁ బోరాడి యారెడ్డికి వాసి తెచ్చినవాఁడగుటచేత ననికొందఱును, కొండవీటిప్రభువైన యనవేమారెడ్డికి సదాశివయ్య శత్రుజయముగలిగించి రెడ్డికి వాసి తెచ్చిన వాఁడగుటచేత ననికొందఱును, అనవేమారెడ్డిచేత సదాశివయ్య

రణశూరుఁడని వాసిగనినవాఁడగుటచేత నసికొందఱును, "సదాశివయ్యకు వాసిరెడ్డి యను పేరుకలిగినది" యని బహువిధములఁ జెప్పుచున్నారు. 'వాసిరెడ్డి' యను బిరుదము నొందిన సదాశివయ్య సంతతివారగుటచే వీరికి వాసిరెడ్డివారని పేరువచ్చినదఁట. సదాశివయ్య కొమారుఁడైన గిరిమల్లికార్జునుఁడు కృష్ణామండలములోని నందిగామలో శక్తీశ్వరస్వామి యను గ్రహముచే వృద్ధినొంది వాసిరెడ్డివారి వంశేశుఁడయ్యెనఁట.

వీరిపూర్వులైన రామన్న, రాఘవయ్య, చంద్రమౌళి, యను ముగ్గురుసోదరులు, ఢిల్లీపాదుషాయైన షాఅలంచక్రవర్తి వలన నందిగామపరగణాను జాగీరుగాఁగైకొని 1686 సం॥ గోలకొండనవాబువలనఁ దమ జమీలో ముగ్గురికిని మూఁడు భాగములకు వేఱువేఱుపట్టాలు పుచ్చుకొనిరఁట.

ఇందు 'మాగల్లు' సంస్థానము రాఘవయ్యగారికిని, 'చింతలపాడు' సంస్థానము చంద్రమౌళిగారికిని రాఘవపుర సంస్థానము రామన్నగారికిని వచ్చెనని చెప్పుదురు.

ఈమూఁడు సంస్థానములను స్థాపించిన ముగ్గురు సోదరులలో రామన్నగారి మునిమనుమఁడైన రామలింగన్నగారు 1760 సం॥ సంతానహీనులై చనిపోఁగా సితని రాఘవపురసంస్థానమును దక్కిన రెండుసంస్థానముల వారునుబంచుకొనిరని కొందఱు చెప్పుచున్నారు. మాగంటి సంస్థానస్థాపకులైన రాఘవయ్యగారికిఁ



పౌత్రుఁడును, పెదపద్మనాభయ్యగారి పుత్రుఁడును నైన నాగన్నగారు, రామలింగన్నగారికి దత్తపుత్రుఁ డగుటచేతఁ, జెంపుడు తండ్రిగారి సంస్థానమంతయు నితనికే వచ్చినందున మాగంటి సంస్థానములో రాఘవపురసంస్థానము కలిసిపోయెనని మఱికొందఱనుచున్నారు. ఎట్లయినను, రామలింగన్నగారిదైన ముర్తుజాన్ నగరు సర్కారు (గుంటూరుమండలము) నాగన్నగారికి సంక్రమించినమాటసత్యము. నాగన్నగారికి రామన్న, జగ్గయ్య, వెంకటాద్రియని ముగ్గురు కొమాళ్ళు. శ్రీ రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుఁడు మన్నెసుల్తానుగారనెడి సుప్రసిద్ధ మహాప్రభువు జగ్గన్నగారి కొమారుఁడు. ఇతఁడు 1778 సం॥ మొదలుకొని నిర్వక్రపరాక్రముఁడై కొంతకాలము గుంటూరియందును మఱికొంతకాలము నూతనరాజధానియైన యమరావతియందును నివసించుచు నమరేశ్వరస్వామిని వైకుంఠపుర విష్ణుదేవుని సేవించి తులాపూరుష దానములుచేసి విద్వాంసుల కనేకాగ్రహారములొసంగి భక్తాగ్రేసరుఁడై దానధర్మశీలుఁడై యిహమందు నింద్రపదవి ననుభవించి సప్తసంతానములు వడసి కీర్తిశేషుఁడైన మహానుభావుఁడు. తాను మరణించినను దన శిలావిగ్రహముల నిత్తడితోడుపుతో నమరేశ్వరాది స్వాములభజించుచున్నట్లుగాఁ జెక్కించి యాలయములయందే నిలిపెను. ఇతఁడు తండ్రిగారి పేర జగ్గయ్యపేటయుఁ దల్లిగారిపేర 'అచ్చమ్మపేట'యుఁ దనపేర 'మన్నెసుల్తాను' పేటయుఁ గట్టించెను.

ఇతఁడు జీవితకాలములోనే తన పితృవ్యపుత్రుల నిద్దరిని జగన్నాథబాబు రామనాథబాబు నను వారిని దత్తస్వీకారముచేసికొని 1816 సం॥ చనిపోఁగా, నితని దత్తపుత్రులు వివాదములు పడి వ్యాజ్యములాడి పోరాడిరి గాని యంతయు నిష్ప్రయోజనమాయెను. 1846 సం॥ రాజ్యము నింగ్లీషువారు స్వాధీనపఱచుకొని వారసులకు నెల ౧ కి రు 1000 (వేయిరూప్యములు) వేతనమేర్పఱచిరి. తద్వంశస్థురాలైన శ్రీరాజా వాసిరెడ్డి వెంకటలక్ష్మీనరసమ్మ బహద్దరు మన్నెసుల్తానుగారు ప్రస్తుతము గుంటూరిలో నివసించియుండి ధర్మశీలురాలై శ్లాఘనీయురాలైయున్నారు.

(2) మానూరివారి వృత్తాంతము.

వీరు మొట్టమొదట మజుందారులుగా (శిస్తువసూలు చేయునధికారులుగా) నుండి, ఔరంగజేబుకాలమున గుంటూరి మండలమందుఁ గొంత జమీ సంపాదించిరి.

వీరిలోఁ గొందఱు కృతికర్తలుగాను మఱికొందఱు కృతిభర్తలుగాను నుండి యాంధ్రభాషనుసన్మానించిరి.

వీరిపూర్వులైన 'అప్పాజీరావుగారు' అధ్యాత్మరామాయణమను నాంధ్రకావ్యమును మృదుమధుర శైలిని రచించి శ్రీరామదేవునికంకిత మిచ్చిరి. కొండవీటి ప్రక్కనున్న శింగిశాలపేటనివాసుఁడైన యొక యాంధ్రకవిచే భట్టాభిరామాయణ మనెడి పద్యకావ్యమును వెంకట్రాయణింగారు కృతినొందిరి.



వెంకటభుజంగరమణయ్యగారు విదేశభాషలనేకములు గ్రహించి పార్సిభాషలోని 'సురుక్ సఖుః' అను కావ్యమును తెలుఁగున విబుధమనోరంజని యను పేరఁ బ్రబంధముగా నొనర్చిరి.

ఇప్పటి మానూరి గోపాలరావుపంతులుగారి తాతగారైన గోపాలరావుగా రాంధ్రగీర్వాణభాషాధురంధరులై గానవిద్యావిశారదులునై యనేక గ్రంథములు తెలుఁగునను సంస్కృతమునను రచియించిరి. ఈతని గ్రంథములు-

1 వాల్మీకీయప్రకాశిక - (వాల్మీకిరామాయణమునకుఁ తెలుఁగు పద్యకావ్యము. షట్కాండలు)

2 రుక్మిణీపరిణయము (అచ్చతెలుఁగు పద్యకావ్యము 7 ఆ.)

3 కీర్తికాంతాస్వయంవరము (పద్యకావ్యము)

4 భరతశాస్త్రము (తెలుఁగుపద్యకావ్యము)

5 రాధామాధవ శతకము (తెలుఁగు)

6 శనిస్తోత్రము; 7 అధ్యాత్మరామాయణ కీర్తనలు.

1846 సంవత్సరమునుండి యింగ్లీషు మండలాధిపతులు జమీందారుల మూలమునఁ గాక తాము గుంటూరుమండలము స్వయముగాఁ బాలింపసాగిరి.

1859 సం॥ రాజమహేంద్రవరము బందరు గుంటూరు జిల్లాలను మూఁడింటిని రెండుగాఁజేసి బందరుజిల్లాలోఁ గొంతభా

గమును రాజమహేంద్రివరమునకును గొంతభాగమును గుం
టూరునకును గలిపి రాజమహేంద్రివరజిల్లాకు గోదావరిజిల్లా
యనియు గుంటూరుజిల్లాకుఁ గృష్ణాజిల్లాయనియుఁ బేరులుపెట్టిరి.

1860 సం॥ 'ఈనాముకమిషను' అను పేర నొక విచా
రణ సంఘమేర్పఱుపఁబడి యీనాంభూములకుఁ బట్టాలనిచ్చెను.

1864 సం॥ పూర్వము గుంటూరు మండలాధికారిగా
నున్న నవ్హిష్‌దొరగారి ద్రవ్యముతో నతని పేర నొక సత్రము
ఎట్టుచెరువునకుఁ బడమరఁ గట్టఁబడెను. దాని నిప్పుడు 'కోడి
గుడ్డుబంగళా' యనుచున్నారు.

1869 సం॥ మద్రాసు బ్యాంకనెడి ధననిధి యిచ్చటనేర్ప
ఱుపఁబడెను.

1880 సం॥ (రాజాగారిస్థలములో) క్రైస్తవులు కళాశా
లను గట్టిరి.

1866 సం॥ నగరపాలకసంఘము (మ్యునిసిపాలిటీ) గుం
టూరున నేర్పడెను. అప్పుడే యప్పటి 'తాలూకాకచేరి'కి దగ్గ
ఱగాఁ బూర్వపు పోలీసుస్టేషనునకు (ఇప్పటి గ్రామమునసఫ్
కోర్టునకు) నుత్తరముగా నగరపాలకసంఘ కార్యశాల (మ్యునిసి
పల్ ఆఫీసు కట్టించి .)

1877 సం॥ మండలాధిపతి నివాసము గుంటూరినుండి
బందరునకు మార్చిరి.



1894 సం॥ శ్రీ వింజమూరి భావనాచార్యులుగారి నగర
పాలకాధ్యక్షతతో వెర్‌లాక్‌మార్కెటు కట్టింపఁబడెను.

1904 సం॥ నగరపాలక సంఘాధ్యక్షుఁడు (మ్యునిసిపల్
చైర్మన్) గానున్న శ్రీ పసుపులేటి వెంకటకృష్ణయ్యనాయఁడు
గారు గుంటూరుగ్రామమునకుఁ బడమటనున్న వెంగళాయపా
లెపువాగులోనుండి యూటనీటిని గొట్టముల మూలముగా నిచ
టికిఁ దెప్పించి గ్రామమునకు నీటివసతి గలిగించిరి; మఱియు
నాతఁడే కూరల నిమిత్తము ప్రత్యేకముగా నొక విపణిశాలను
(మార్కెట్టును) నగరపాలకశాలకుఁ బడమరగాఁ గట్టింపఁగా
దానికి నతనిపేర 'పసుపులేటి వెంకటకృష్ణయ్య మార్కెట్'
అని పేరు పెట్టిరి.

1904 సం॥ కృష్ణాజిల్లానుండి గుంటూరుజిల్లా వేఱుచేయఁ
బడెను గాని మండలాధిపతి కార్యస్థానము ఆగ్రామమునకు
వాయవ్యముననున్న పాతకారాగృహములలో నుంచిరి.

1912 సం॥ ఆగృహములకుఁ బడమరగాఁ గట్టఁబడిన
నూతన భవనములకు మార్పఁబడెను.

1915 సం॥ గుంటూరు నగరపాలకసంఘమువారి వెను
కటి యౌషధశాలను మార్చి దొరతనమువారు స్వాయముగా
నౌషధశాలను రాజాగారిస్థలములో స్థాపించిరి.

1923 సం॥ ఫిబ్రవరి 25 తేది (దుందుభినామ సం॥
ఫాల్గున శుద్ధ నవమీ భానువారమునాఁడు) గుంటూరు పుర

జనులు తామిదివఱకుఁ బాతగుంటూరిలో 'తిక్కనసోమయాజి' కవీంద్రుని పేరఁబ నెలకొల్పిన 'తిక్కనాలయ'మనెడి గ్రంథాలయమునకు నూతన భవనము ప్రతిష్ఠించిరి.

---

## పదునొకండవ ప్రకరణము.

### గుంటూరుగ్రామవిస్తరణము

ఇప్పటి యెఱ్ఱచెఱువునకుఁ దూర్పుననున్న పాత గుంటూరే పురాతనమైన గుంటూరనియు, నిప్పటి గుంటూరు పాత గుంటూరి నంకురముగాఁ జేసికొని పెరిగినదేయనియు, నిదివఱకే తెలుపఁబడెను. ఈ చెఱువునకుఁ బడమర వైపున నద్దంకమ్మ గుడియొకటి యేటుకూరు వెళ్ళెడి పొలిమేర డొంక * దరినుండెను. ఆడొంక నానుకొని పొలములే కాని యిండ్లు పూర్వము లేవు. ఆడొంకకుఁ బడమర గుంటూరి పడమట చేలును, ఆ చేలకు నైరృతి దిక్కున నల్ల చెఱువుమాత్రముండెను. ఇప్పటి పెద్దబజారు నప్పటికి లేదు. అద్దంకమ్మగుడిచుట్టును బొలములే యుండెను.

[రామచంద్రపురాగ్రహారము]

ఇట్లుండఁగా శా॥ శ॥ ౧౬౮౦ సం॥ (క్రీ॥ ౧౭౫౮) హేవళంబినామ సం॥ మాఘ శు ౧౫ నాఁడు శ్రీరాజావాసి

* ఆ పొలిమేర డొంకయే యిప్పటి వడ్లవీధియై ఉత్తరదక్షిణములుగా వెళ్లుచున్నది.



రెడ్డి వెంకటాద్రినాయఁడు మన్నెసుల్తానుగారి ముత్తాతగారును రాఘవపురసంస్థానాధిపతులునైన రామలింగన్నగారు "పాత గుంటూరి పడమట పొలములలో నల్లచెఱువునుత్తరపుఁగొమ్మున నున్న (రామచంద్ర) పాలెమును 'రామచంద్రపురాగ్రహారము' గాఁజేసి... కేసరిపాటి పగ్గాన ముప్పదికుచ్చెలలభూమి కొలిచినమల జగ్గావధానులు గుండు నరసావధానులు మొదలైన బ్రాహ్మణులకు, దానముచేసి పట్టాయిచ్చిరి.

అటుతరువాత శా॥ శ॥ ౧౬౫౬ సం॥ క్రీ॥ శ॥ ౧౭౩౪ చిత్రభానునామ సం॥ ఆశ్వయుజ శుద్ధ పూర్ణిమనాఁడు "వల్లుట్ల గోత్రులును రాఘవయ్యగారి నప్త్రులును బద్మనాభునిగారి పౌత్రులును నాగన్నగారి పుత్రులును (శ్రీరాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయఁడుగారి పితయును)నైన 'జగ్గన్న'గారు (పూర్వము రామలింగన్నగారిచ్చిన ముప్పదికుచ్చెలలకు నాలుగుకుచ్చెలలను జేర్చి) ముప్పదియాఱుకుచ్చెలలకు వెల్లంకి సీతారామశాస్త్రులు మొదలైన బ్రాహ్మణులపేరటికి సనదు" నిచ్చిరి.

అటు పిమ్మట శా॥ శ॥ ౧౬౯౧ సం॥ క్రీ॥ శ॥ ౧౭౬౯ సర్వధారినామ సం॥ ఆషాఢశుద్ధాష్టమినాఁడు జగ్గన్నగారిసోదరులైన రామన్నగారు వేనొకటి ముప్పదియాఱు కుచ్చెలలోని యాఱుకుచ్చెలలకుఁ బ్రత్యేకముగా నొక పట్టాయిచ్చిరి.

ఈయగ్రహారపుభూమి నిప్పటికిని దద్వంశీయులనుభవించుచున్నారు. అప్పటి కరణములు మల్లెమువారు, పొత్తూరివారు,

అక్కైనప్రెగడవారు. వారికి నప్పటిభాగములు వరుసగా ౪-౨-౧ యని పాతగుంటూరి యగస్త్యేశ్వరస్వామివారి యాలయము నందొక శిలాశాసనమున నున్నది.

ఆకాలముననే యగ్రహారమునకుఁ దూర్పుగా 'సంగడిగుంట' యను పేట యేర్పడెను. ఇది సంగడ నెడి చోఁకలివాని వలనఁ గలిగినది.

### మధ్యవిస్తరణము.

నైరృతిదిక్కుననున్న రామచంద్రపురాగ్రహారమును బాతగుంటూరును విడివిడిగ్రామములుగా నుండి కొంతకాలము వఱకును గలియకయే యుండెను.

**1753** సం॥ ప్రాంతమందుఁ బరాసువారు (ఫ్రెంచివారు) 'ఇప్పటి పురోన్నతపాఠశాల' (టౌన్ హైస్కూలు)ఉన్న మైదానమును సేనానివేశస్థానముగాఁ జేసికొని దానికి దక్షిణమున నొక రోమన్ కాథలికుగుడి కట్టించి దానియావరణప్రదేశమును సమాధిస్థలముగాఁ జేసికొనిరి. ఇప్పటికి నాసమాధిస్థలము కలదుగాని యాగుడి శిథిలమైనది. ఈప్రదేశము లగ్రహారమునకు నుత్తరముననున్నవి.

**1763** సం॥ [అనఁగా, రామచంద్రపురాగ్రహార మేర్పడిన తరువాత నలువదియైదు సంవత్సరములకు] మహామ్మదీయులు కొందఱువచ్చి యీరెండుగ్రామములమధ్యను [ఎల్లచెఱువు



ఉత్తరదిక్కున] గొన్నియిండ్లు కట్టుకొని యాయిండ్లకుఁ బడమరవైపున నిప్పటి పెద్దమసీదు కట్టించిరి. అప్పటికా మసీదు స్థలమునకు దక్షిణ దిక్కున 'కొత్వాలు సావడి' మాత్రముండెను. 'ఆకొత్వాలుసావడి' స్థానములోఁ బ్రస్తుతమున నీటిగొట్టములు పెట్టఁబడి లింగమల్లువారియిండ్లకుసామీప్యముననున్నవి.

1766 సంవత్సరమున నిచటఁ 'బురపాలక సంఘము' [మ్యునిసిపాలిటి]ఏర్పడినందునఁ బైనఁజెప్పఁబడిన సేనానివేశపు బయలునకుఁ దూర్పుగా నిప్పటి 'పురపాలకసంఘకార్యశాల' [మ్యునిసిపల్ ఆఫీసు] నిర్మింపఁ బడెను.

[1781 సం॥ ప్రాంతమున గుంటూరిమండలములోని నలుగురు జమీన్‌దారులకును నిజాముగ్రామములు పంచియియ్యఁగా వారు నలుగురును బాతగుంటూరిలోఁ గోటలు కట్టుకొనిరి.]

1788 సం॥ గుంటూరుమండల మింగ్లీషువారికి రాఁగానే మండలాధిపతి కార్యస్థానమును [కలెక్టరుకచేరిని], తహశ్శీలుదారుకచేరిని, పోలీసుస్టేషనును, మండలన్యాయాధిపతి కార్యస్థానమును (జిల్లాకోర్టును) గట్టించిరి. ఇవియన్నియుఁ బూర్వము గ్రామపశ్చిమముననున్న, ఇప్పుడు మధ్యను నున్నవి.

### ఉత్తరవిస్తరణము.

ఇప్పటి క్రొత్తపేటకు దక్షిణమునను, పాత క్రీస్తుగుడికిఁ దూర్పునను, గొంతకాలముక్రిందట సహాయ మండలాధికారి

కార్యస్థానము (సబ్ కలెక్టరాఫీసు) మొట్టమొదట ర..డల పతి కార్యస్థానము. ఇప్పటి యారక్షకభటకార్యస్థానమే (పోలీసు స్టేషనే) మొట్టమొదటి తహశ్శీలుదారుకచేరి. ఇప్పటి గ్రామాధికారి (విలేజిమున్సఫ్) కచేరియే మొట్టమొదటి పోలీసు స్టేషను. ఇప్పటి ఆబ్కరీగారి బంగళా మొదట జిల్లాకోర్టుగా నుండెను. అటుతఱువాత నీజిల్లాకోర్టును దీనికినుత్తరపుదిక్కునఁ గట్టించినారు. అది యిప్పటి (అసలు) మునసఫుకోర్టు. ఈకార్యస్థానము లేర్పడిన సమయమునుండి గుంటూరి వ్యాపారమును జనసంఖ్యయు నెక్కువగుటచేత, నద్దంకమ్మగుడిచుట్టును వర్తకపుఁ గొట్లుకట్టిరి. చుట్టును వర్తకుల యిండ్లు పెరిగి గ్రామ మధ్యభాగ మింకను విస్తరిలి రామచంద్రపురాగ్రహారమును పాతగుంటూరును గలిసిపోయెను.

1788 సం॥ ప్రాంతమున శ్రీ రాజావాసిరెడ్డి వెంకటాద్రినాయఁడుగారు తన ప్రథమరాజధానిని వదలి గుంటూరికి వచ్చియుండి 'యమరావతిని' గ్రొత్తరాజధానిగాఁ జేసికొని యచ్చటినుండి యిచ్చటికి వచ్చుచుఁ బోవుచుండు కాలములో శ్యామలదాసగ్రహారము కృష్ణారావగ్రహారమునను నవి యిప్పటి మండలాధికారి కార్యస్థానమునకు నుత్తరభాగమునందు నేర్పడెను. అవి యిప్పటి క్రొత్తపేటకుదక్షిణమున ముఖ్యస్థలములుగానున్నవి. ఇవియే క్రొత్తపేటకు మూలాంకురములు.



శ్రీ ప్రభు ప్రధానిగాఁ
రాప్రగ ములకు 14 గృహము
చిన పేట రావగ్రహారము. శ్యామ
పాతరహదారి కు నుత్తరమునను వ
నున్నది. ప్రస్తుతము సకల రయ్యాగారు కట్టించి
శ్యామలదాసగ్రహారములోనిడి ఆకాలముననే యి
హారమునకునుత్తరమున, నుదాసీనబావాజీయను నొక
డు దరఖాస్తుమీఁదఁ గొంతస్థలము తీసికొని మఠమ
దేవాలయము నచటఁగట్టించి చెఱువుత్రవ్వించెను. ఆచెఱు
విప్పటి మిషనుకాలేజికిక్రింది కాటస్థలముగాఁ గైకొనఁబడినది.

ఆస్థలమునకుఁ దూర్పువైపున నిప్పటి పట్‌మర్ బంగళా యున్న ప్రదేశమునందు శ్రీ రాజాగారు వ్యవహారకార్యస్థానముగా నేర్పఱచుకొని తత్ప్రాంతమునఁ దనపేరమున్న సుల్తానుపేటను గ్రొత్తగాఁగట్టించెను. దానికే యిప్పుడుక్రొత్తపేట యనుపేరు వచ్చినది. ఆపేటలోఁ గొంతకాలమునకుఁ దఱువాత నిప్పటికి సుమారు డెబ్బది సంవత్సరముల క్రిందట నెడవల్లివారి సత్రము కట్టింపఁబడినది.

1788 సం॥ నుండి గుంటూరు న్యాయవిచారణ "ఆలోచన సభాధిపతిసంఘము" క్రింద నుండెను.

1794 సం॥ ఈసంఘమును దీసివైచి దీనికి మాఱుగా మండలాధిపతులను (జిల్లాకలెక్టరులను) నిర్ణయించిరి. శిస్తు

...గా నుండకపోవుట ... త్రైన

...ండెను.

...౦॥ జిల్లాకోర్టు బాదరు ... నే మాఱి

...2 సం॥ రివరెండు ఫాదరు ...యర్ అను (లూథ...) క్రైస్తవ మతబోధకుఁడు గుంటూరుకువచ్చి యపు... మండలాధికారిగానుండిన స్టోక్సుదొరగారి సహాయ... చే నిచటఁ గ్రైస్తవమతము నెలకొల్పి వెళ్ళినతరువాత 1844 సం॥ రివరెండు గన్ దొర మతబోధకుఁడుగా వచ్చి స్టోనుగారి వలనఁ గొంతస్థలమును దరఖాస్తుమీఁదఁ గైకొని యచ్చట బంగాళాకట్టింపఁగా దాని యావరణములోనే పాతక్రీస్తుగుడి కట్టఁబడెను. వుల్ఫుగారి బంగాళాయనునదే పూర్వము గన్ బంగళాయను పేరుగలిగియుండెను. పాతక్రీస్తుగుడి నిపుడు పడఁగొట్టి దానిచేరువనే, యింకొక క్రీస్తుగుడి కట్టియున్నారు.

దక్షిణవిస్తరణము.

1846 సం॥ ప్రాంతమందు 'గుంటూరు చలమయ్య' యను నొక వైశ్యశిఖామణి పెద్దబజారునకు దక్షిణమున తన మాన్యపుఁ బొలములో నొకసత్రము కట్టించెను.

1856 సం॥ గుంటూరి మండలాధిపతియైన న్యూయలు దొరవారిపేర, చలమయ్యగారి సత్రమునకు నైరృతిదిక్కుగా 'న్యూయలగ్రహార' మను పేర నొక పేట గట్టఁబడెను.



...డలాధికారియైన ...

...థము. ... ర ...గుచంద్రపురము

స్వామి...లద్ధి... ము...ళ్ళి దక్షిణమున నొక

గ్రామమ...జీవించు... ...చెను. ఈయనయే

...హారమునకుఁ బశ్చిమదిక్కుననున్న నృసింహస్వామి వా... యమును వృద్ధిచేసి యగ్రహారమునకీశాన్యదిక్కున నొక... కట్టించిరి. ఇట్లు గ్రామదక్షిణము విస్తరిల్లుచుండెను. ...మోత్తరదిగ్భాగము నప్పుడే విస్తరింపనారంభించెను. తద్విస్తరణమిఁకఁ జెప్పఁబడును.

పశ్చిమోత్తరవిస్తరణము.

1846 సం॥ క్రైస్తవ బోధకుఁడైన గ్రానింగుదొర పాత కోర్టును దానియావరణ స్థలమును దొరతనమువారి వలనఁ దీసికొని బంగళాకట్టెను. దానికే గన్ బంగళాయని పేరువచ్చెను. అదియే యిప్పటి ఆబ్కారీబంగళా. ఇది పూర్వసేనానివేశనస్థానమునకుఁ బడమరనున్నది.

1846 సం॥ డిశంబరు 13 తేది గుంటూరు మండలాధిపతియైన హెన్రీస్టోక్సుదొరగారప్పటి గవర్నర్ జనరలుగారివలన 99 సంవత్సరముల కౌలుమీఁద నప్పుడు గుంటూరికి వాయవ్యదిగ్భాగమున(శ్యామలదాసగ్రహారమునకుఁ బడమర) 47 యకరముల 27 శెంట్ల భూమిని; 1851 సం॥ దరఖాస్తుమీఁద

...రములు 19 సెంట్లు
... 2926 చదరపు గ... ...
...యకరములు స్థలమును ... ...
సం॥ జూను 5 వ తేదీ ... ...మం
...ధికారి (జిల్లాజడ్జి) గా... ... దొరకు
...వేలరూపాయిలకు విక్రయింపఁగా, 1860 సం॥ సెప్టెం
27 తేదియం దాయాస్థలములన్నియు నందలి గృహాదు
...గూడ నిడదవోలు జమీందారైన శ్రీ రాజానారయ
ణప్పారావుగారికి 13500 రూపాయిలకు విక్రయించిరి. అప్పటి నుండియు నీస్థలమును నందలి గృహములును జమీందారుల యధీనముననే యున్నవి.

1888 సం॥ ప్రాంతమున నినుపదారి యిచటికి వచ్చినపుడు దానికి నుత్తరమున 'అరండలుపేట'యు, దక్షిణమున బ్రైలుపేటయు నేర్పడెను. ఇవి యిప్పటి గుంటూరికి నుత్తరమున నున్నవి.

---

## పండ్రెండవ ప్రకరణము.

## గుంటూరి ప్రకృత స్థితిగతులు.

పాతగుంటూరే యంకురముగాఁగల యీగుంటూరు పురము, వైశాల్యము, వర్తకము, జనసంఖ్య, యింగ్లీషువిద్య, యారోగ్యము మొదలైన విషయములలోఁ బూర్వముకంటె నిపుడు వృద్ధిచెందియున్నది.

...కాభివృద్ధి...
వలన జీవించు...
దూది, ధాన్యము,
సుంకులు. ఈనగరము
దాదాపుగా నేఁబదివేల జన...
ఆరోగ్యతకుఁ బ్రసిద్ధిగల యీ...
రామచంద్రపురాగ్రహారములను భాగి...
లు గలిగి యిఱుకుగా నుండుటచేత నపరిశుద్ధములై యప్పుడంటువ్యాధుల కాస్పదములగుచున్నవి. ఈగ్రామమునందు ముఖ్యముగాఁ బైనఁజెప్పిన భాగములయందే 1918 సం॥ మార్చి నెల 26 తేది మొదలుకొని 1919 సం॥ ఏప్రియల్ నెల 19 తేదివఱకును మహామారివ్యాధి (బొబ్బలరోగము) వ్యాపించి 1918 సం॥ 77 జనమును, 1919 సం॥ 237 జనమును నశించెను.

గ్రామపాలకసంఘము వారి యధ్యక్షతక్రిందనున్న రమారమి యిరువది పాఠశాలలుగాక (గుంటూరు) పురోన్నత, పాఠశాలాసంఘము వారిక్రింద నొక యున్నతపాఠశాలయుఁ గ్రైస్తవమతబోధకసంఘాధ్యక్షతక్రింద బాలికలకొక యున్నత పాఠశాలయు, బాలురకొక కళాశాలయు నెలకొల్పఁబడి యున్నవి. ఇంక ననేకములయిన చిల్లరబడులు నలువది గలవు.

లైన

సం॥ 33359;

సం॥ 48184.

ంఖ్య 48184 లో,

కాంబట్టియిచట స్త్రీపురుషు

ఉంచుగా సమానముగానున్నది.

లో హిందువులు 34608; మహమ్మదీ

170; క్రైస్తవులు 3454; ఇతరులు 262.

ఇట్లు గుంటూరు సర్వవిధముల వర్ధిల్లుచున్నది.

గీ॥ వివిధవిద్యావివేక వై ♦ భవము గలిగి,
తిక్కననుబోలు సత్కవి ♦ ధీరు లమరి,
పసిండి వర్షించు ముక్కారు ♦ పంట లలరి
భవ్యకీర్తుల గుంటూరు ♦ ప్రబలుంగాత ! ॥

సంపూర్ణము.



నందిని ముద్రాక్షరశాల, గుంటూరు.

